Photo by Sundaramoorthy



బహుమతి
పొందిన వ్యాఖ్య

చిక్కిన చారల జంతువు

పంపినవారు:
ఎ. కె. మోహన్‌రావు












HAMAM
TOILET SOAP


A
TATA
PRODUCT

3

# మల్టికలర్

## ఫొటో ఆఫ్‌సెట్ ప్రింటింగ్,
## ప్రోసెస్ బ్లాక్ తయారీలలో

అత్యున్నతస్థానాన్ని నిలబెట్టడమే ఎల్లప్పుడు మా ముఖ్యాశయమని నమ్మకముగ చెబుతున్నాము



మన భారతదేశమందలి ఏ సంస్థయు ఇంతవరకు ఎరుగని 30 అం. × 40 అంగుళముల బ్రహ్మాండమైన కెమెరాను, సరికొత్త ఆధునిక యంత్ర పరికరాలను నెలకొల్పి వున్నాము. నిపుణులు, అనుభవజ్ఞులు ఐన మా టెక్నీషియనులు, ఆర్టిస్టులు

**మీ చిత్రములకు అచ్చు సరియైన పోష్టర్లు తయారు చేయుగలరు**

---

# ప్రసాద్ ప్రోసెస్

## చందమామ బిల్డింగ్స్, మదరాసు-26





## ఈ సంచికలో కథలు

## వింతలు - విశేషాలు







ఇవిగాక - రంగులబొమ్మ కథ,

ఫోటోశీర్షికల పోటీ - మొదలైన

మరి ఎన్నో ఆకర్షణలు

# మా దీపావళీ ప్రత్యేక సంచికల ప్రచురణలో

సహకరించి తోడుపడిన ఎల్లరకూ
హృదయపూర్వకంగా కృతజ్ఞత తెల్పుకొంటూ,

★ వారి ఆర్డర్లమేరకు పూర్తిగా కాపీలు సప్లయి చేయజాలనందులకు మా ఏజంట్లు,

★ ఈ ప్రత్యేక సంచికతో చందాసభ్యత్వమును ప్రారంభింపలేకపోయినందుకు మా క్రొత్త చందాదారులు,

★ వారి ప్రకటనలకు ఈ సంచికలో తావు కల్పింపజాలనందులకు అభిమానులగు మా ప్రకటనకర్తలు

అన్యథా భావింపకుందురుగాక అని కోరుతూ
ఇటుపైన అందరకు అన్నివిధములా ఎక్కువగా
సేవ చేయుగలమని విన్నవిస్తున్నాము.

## చందమామ పబ్లికేషన్స్

చందమామ బిల్డింగ్స్, మద్రాసు - 26

# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

దీపావళి సంచికను సమర్పించిన సందర్భంలో మా కృషిని అభినందిస్తూ చాలామంది ఉత్సాహపూరితమైన లేఖలు వ్రాస్తున్నారు. ఇందుకు ఎంతయినా కృతజ్ఞులం. కథలు ఇంకా ఎక్కువగా కావలెననె మా పాఠకుల అభిలాషకూడా ఈ లేఖలలో బాగా స్పష్టపడుతున్నది. నిజానికి, నిక్షిప్తమైవున్న జాతియధనమే మన కథాసారస్వతం. తరుగు లేని ఈ సారస్వతానికి కొత్త మెరుగులతో వెలుగుచూపడమే చందమామ ఆశయం. కనుక, మీరు విన్నటువంటి జానపదకథల్లో మంచివి వ్రాసి పంపుతూవుండండి చక్కని చిత్రాలతో ప్రకటిస్తాము. ఈ విధంగా మరుగున పడిపోయిన మంచి కథలెన్నో మీతోపాటు ఇతరులుకూడా చదివి ఆనందించే అవకాశం కలుగుతుంది. ఉత్సాహవంతులైన మీ అందరి సహకారంతో, రాబోయే కొత్త సంవత్సరంలో ఈ ఆశయాన్ని మన చందమామ తప్పక సఫలీకృతం చేయగలదని ఆశిస్తున్నాం.

సంపుటి 15 : డిసెంబర్ 1954 : సంచిక 6





CHITRA

# విశ్వప్రేమ

నక్కబావ డొక్క కాలి
ఎక్క డేమి దొరకక
తిక్కపట్టినట్లు తిరిగి
తిరిగి చివరకు ;

గుడిసెపైన కూరుచున్న
కోడిపుంజువైపు చూచి,
'మంచివార్త! మంచివార్త!!'
అంచు పిలిచెను.





గుంటనక్కగారి జోరు
కంట జూచి కోడిపుంజు
'ఏమిటేమి?' టంచు ప్రశ్న
వేసి నంతనె,

'విననె లేదటోయి! నీవు,
'విశ్వప్రేమ' యనెడి పేరు!
ఇంక మీరు మేము ఆప్త
బంధు మిత్రులం!

నేటినుండి విశ్వప్రేమ
చాటవలయు మనము
రమ్ము, కట్టకేగి పైరు కాస్త
కొట్టి వత్తము.'





రచన : కవిరావు

'కుక్కబావ ఎరుగదాయె
విశ్వప్రేమ యనెడి పేరు!'
అంచు నక్క తిరిగిచూచి
పరుగు తీసెను.

'వట్టి పాడు రోజింతకు
ఒకరి ననిన ఫలమే' మని
పరుగు తీస్తు గుంటనక్క
పలవరించెను.

ఇట్టు లనగ కోడిపుంజు
పట్టలేని సంతసాన
గొంతు చాచి ఒక్కమారు
కూత వేసెను.

'ఒక్క క్షణము తాళు మదుగొ
కుక్కబావ వచ్చుచుండె,
వానితోడ కలిసి పోవ
వచ్చు' నన్నది.

తక్షణంబె గుంటనక్క
తారుకొంచు నుండ జూచి
'పోదువేటి కం'చు కోడి
పుంజు పల్కెను.



# అట్టమీది బొమ్మ

అరణ్యావాసం చేస్తున్న పంచపాండవులు ఎక్కడెక్కడి పుణ్యక్షేత్రాలూ దర్శించుకొంటూ, మహాత్ముల గాథలను వింటూ వచ్చారని చెప్పాముకదా! వారొక రోజున, పూర్వం శిబిచక్రవర్తి యజ్ఞంచేసిన స్థలం చేరుకొన్నారు. ఈ శిబిచక్రవర్తిని గురించిన అద్భుత కథను రోమశఋషి ఇలా వినిపించాడు :-

చంద్రవంశానికి చెందిన శిబిచక్రవర్తి లెక్కలేనన్ని యజ్ఞాలు చేస్తూ వుండగా, ఒకప్పుడు ఒక విచిత్రం జరిగింది. అకస్మికంగా ఒక పావురం భయంతో పరుగెత్తుకువచ్చి శిబి చేతిపైన వాలింది. "రాజా!—శరణు, శరణు!!—రక్షించు, రక్షించు!!!" అంటూ ఆర్తనాదం చేసింది.

వెంటనే చక్రవర్తి పావురంతో 'నీకు వచ్చిన భయమేమీలేదు...' అని చెప్పి అభయమిచ్చాడు.

అంతలో భయంకరరూపుడైన ఒక కిరాతకుడు అక్కడకు వచ్చి, 'రాజేంద్రా!–ఇది నేను వేటాడిన పావురం. కనుక నా పావురాన్ని నాకిచ్చెయ్యి' అని అడిగాడు.

అందుకు శిబి 'దీనికి నేను అభయమిచ్చివున్నాను. కనుక దీనికి బదులుగా మరేదైనా కోరుకో, తప్పక నీ కోరిక నెరవేరుస్తాను' అని జవాబుచెప్పాడు.

అప్పుడు కిరాతకుడు 'రాజా!—ఈ పక్షి మాంసానికి సరిఅయిన విలువ కలది నీ మాంసమే. కాని అది అడగటం న్యాయం కాదుగదా? కనుక, దయవుంచి నా పావురాన్ని నాకిచ్చివేయి' అన్నాడు.

ఈ మాటకు చక్రవర్తి 'అయితే ఈ పక్షి మాంసానికి సమానంగా నా మాంసమే ఇస్తాను' అంటూ వెంటనే తక్కెడ తెప్పించి, ఒకపక్క ఆ పావురాన్ని ఉంచి, రెండవ పక్క తన శరీరంనుంచి మాంసం కోసిపెడుతూవచ్చాడు. చిత్రం!—ఎంత మాంసం కోసిపెట్టినా, ఆ పావురం బరువుకి సరిపోలేదు.

ఇదిచూచి, శిబి 'ఓయీ బోయవాడా!—నీవు ఈ తక్కెడ పట్టుకో. నేనే ఇందులో ఎక్కి కూర్చుంటాను' అని తక్కెడను కిరాతకుడికి ఈయబోతూ వుండగా—కిరాతకుడు సాక్షాత్తు దేవేంద్రుడుగాను, పావురం అగ్నిదేవుడుగానూ శిబిచక్రవర్తికి ప్రత్యక్షమయ్యారు.

"చక్రవర్తీ!–నీ త్యాగశీలాన్ని పరీక్షించటానికి మేమీ రూపంలో వచ్చాము. నీ కీర్తి చిరస్థాయిగా ఉండుగాక!" అని దీవించి, వారు అంతర్ధానమయ్యారు.




ఒకరాజ్యంలో దొంగతనాలు జాస్తికావటం వల్ల, పట్టుబడిన ప్రతి దొంగనూ ఊరి బయట బహిరంగంగా ఉరితియువలసిందని రాజుగారు ఉత్తరువుచేశారు. అదేవిధంగా ఎందరో దొంగలు ఉరితీయబడ్డారుకూడా.

ఆ రాజ్యంలోనే ఒక ఊళ్ళో కన్నడూ, చిన్నడూ అని ఇద్దరు దొంగలుండేవారు. తోటిదొంగలు కొందరు ఉరికావటం చూసి బెదిరిపోయి, కన్నడూ చిన్నడూ దొంగ వృత్తి మానటానికి నిశ్చయించారు.

"ఇంతవరకూ చాలా పాపం చేశాం. ఇకనన్నా మంచిగా జీవించుదాం!" అన్నాడు కన్నడు.

"చేసుకోదలిస్తే బోలెడన్ని వృత్తులు!" అన్నాడు చిన్నడు.

వాళ్ళిద్దరూ పక్కగ్రామంలోని పెద్దరైతు దగ్గిర పని సంపాదించుకున్నారు. రోజూ ఎడ్లను బీడుకు తోలుకుపోయి మేపుకు రావటం కన్నడి పని. తోటలో చెట్లకు నీళ్లు పోయటం చిన్నడి పని.

మొదటిరోజు కన్నడు ఉదయమే లేచి ఎడ్లను తోలుకుని బీడుకు వెళ్లాడు. ఎడ్లు వాణ్ణి నానా తిప్పలూపెట్టాయి. వాటిల్లో అవి పోట్లాడుకోవటమూ, పరుగులుతీయటమూ, పక్కనేఉన్న పొలాలలోకి జొరబడటమూ మొదలైన పనులు చేయసాగాయి. వాటిని అదుపులో ఉంచటం కన్నడికి చాలా కష్టమైపోయింది.

ఈలోపల చిన్నడు తోటలో ఉన్న చెట్లకు నీరుపోయసాగాడు. ఎన్ని కడవలు తోడినా చెట్లకు చాలలేదు. సగంతోటన్నా తడవక ముందే చిన్నడికి చేతులు పడిపోయాయి. నడుము విరిగిపోయినట్టయింది. సాయంత్రం దాకా వాడు తోటకు నీరెత్తుతూనే ఉన్నాడు.

ఆ రాత్రి కన్నడూ, చిన్నడూ తమతమ పనులనుగురించి మాట్లాడుకున్నారు.

డి. స్వరాజ్యలక్ష్మి



"నాకు పనిచేసినట్టేలేదు. ఎడ్లను బీట్లో వొదిలేసి చెట్టుకింద పడుకుని హాయిగా నిద్రపోయాను. అస్తమయంవేళకు ఎడ్లు వాటంతట అవే నాదగ్గిరికి వచ్చాయి. వాటి మువ్వలచప్పుడుకు నిద్రలేచి, వాటిని తోలుకుని ఇంటికి వచ్చాను" అన్నాడు కన్నడు.

"నేనూ అంతే. నాలుగు కడవల నీరు పోసేసరికి తోటంతా తడిసి ఊరుకుంది. రోజల్లా మంచంమీద పడుకుని నిద్రపోయాను!" అన్నాడు చిన్నడు.

"భేష్! రేపు సరదాగా నువు ఎడ్లను మేపుకురా. నేను తోట తడుపుతాను," అన్నాడు కన్నడు.



చిన్నడికి చాలా ఆనందంవేసింది. "నేనూ అదే అందామనుకుంటున్నాను!" అన్నాడు వాడు కన్నడితో.

"బీట్లో పడుకునేటందుకు మంచం కూడా మరిచిపోక పట్టుకెళ్ళు సుమీ!" అని హెచ్చరించాడు కన్నడు.

మర్నాడిద్దరూ పనులు మార్చుకున్నారు. ఒకరిమోసం ఒకరికి తెలిసిపోయింది.

అయితే కన్నడు ఇంకొక చిత్రంకూడా గమనించాడు. తోటలో ఒక మామిడిచెట్టు మొదట్లో ఎన్ని కడవలు నీరుపోసినా ఇంకిపోతోంది. దాని రహస్యం ఏమిటో ఆ రాత్రి కనిపెట్టాలనుకున్నాడు కన్నడు.

ఆ రాత్రి కన్నడుగాని చిన్నడుగాని తమ పనులనుగురించి మాట్లాడనేలేదు. ఇద్దరూ నిద్రపోతున్నట్టు పడుకున్నారు. ఒక రాత్రివేళ కన్నడు లేచి పక్కనే ఉన్న పలుగు తీసుకొని మామిడిచెట్టుదగ్గిరికి వెళ్లి, దాని పాదులో తవ్వటం మొదలుపెట్టాడు. కొంతసేపు తవ్వాక పలుగుకు ఏదో తగిలి ఖంగ్‌మని శబ్దం అయింది.

వెంటనే కన్నడు చుట్టూ చూశాడు. చిన్నడు చీకట్లో పక్కనే నిలబడిఉన్నాడు.

"ఏమిటి ఈ రాత్రివేళ తవ్వుతున్నావు?" అన్నాడు చిన్నడు.



"ఈ చెట్టుకు పాదు సరిగాలేదు. నిద్ర పట్టక పాదు సరిచేస్తున్నాను," అన్నాడు కన్నడు అమాయికంగా.

"ఖంగ్‌మని మోగిందేమిటి?" అన్నాడు చిన్నడు నవ్వు అపుకొంటూ:

"ఏవో రాయి అయి ఉంటుంది! పోయి పడుకుందాం పద," అన్నాడు కన్నడు.

ఇద్దరూ వెళ్ళి పడుకున్నారు. చిన్నడు నిద్రపోయాక మళ్లీ వచ్చి పలుగుకు తగిలినదేమిటో చూతామనుకున్నాడు కన్నడు. కాని ముందు వాడికే నిద్రపట్టింది.

కన్నడు గురక ప్రారంభించగానే చిన్నడు లేచాడు. పలుగు తీసుకుని మామిడిచెట్టు దగ్గిరికి వెళ్లాడు. పాదు తవ్వి లంకెబిందెలు పైకి తీశాడు. వాటిని వెంటనే ఎక్కడైనా దాయాలి. సమీపంలోనే చెరువున్నది. లోతు అటే లేనిచోట చెరువులో ఆ లంకెబిందెలు మట్టిలో పాతిపెట్టి చిన్నడు ఏమీ ఎరగనట్టు వచ్చి పడుకుని నిద్రపోయాడు.

కన్నడు తెల్లవారుజామునే లేచాడు. పలుగు తీసుకుని చెట్టుదగ్గిరికి వెళ్లాడు. లంకెబిందెల జాడ కనిపించలేదు. తిరిగి వచ్చి, నిద్రపోతున్న చిన్నడి కాళ్ళు పరీక్షించాడు. చిన్నడి కాళ్ళకు బురదా, కొంచెంగా నాచూ కనిపించాయి. చెటు






చిన్నడు కొంతసేపు పరిగెత్తినాక, వాడికి అంతదూరాన బిందెలు మోసుకుపోతూ కన్నడు కనిపించాడు. చిన్నడు డొంక వొది లేసి అడ్డదారిన పరిగెత్తి కన్నడికన్న ముందు వెళ్ళి మళ్ళీ డొంక ఎక్కి, తన కొత్తచెప్పులలో ఒకటి ఒకచోట విడిచి, రెండోది నూరుగజాల అవతల విడిచి, అక్కడే ఉన్న ఒక చెట్టెక్కి, గుబురులో దాగి కూచున్నాడు.

కొద్దిసేపటిలో కన్నడు లంకెబిందెలను మోయలేక మోయలేక మోస్తూ అటుగా వచ్చాడు. కొత్తచెప్పు వాడికంట పడింది. కాని ఒకటే ఉండటం చూసి నిరాశచెంది ముందుకు వెళ్ళాడు. నూరు గజాలు వెళ్లాక దాని జత కనబడింది. ఆశ పుట్టింది. చుట్టూ పురుగుకూడా లేకపోవటం గమనించి కన్నడు లంకెబిందెలు కిందపెట్టి, అక్కడ ఉన్న చెప్పు తీసుకుని, రెండోదాని కోసం వెనక్కు వెళ్లాడు.

ఈ సమయంలో చిన్నడు మెల్లగా చెట్టు దిగివచ్చి దారిలో పెట్టివున్న లంకెబిందెలు భుజానికెత్తుకుని శక్తికొద్దీ నడుస్తూ తన ఇల్లు చేరుకున్నాడు.

రెండు కొత్తచెప్పులూ తీసుకుని కన్నడు తిరిగివచ్చేసరికి లంకెబిందెలు లేవు. ఇది

పొదులో దొరికిన వస్తువును చిన్నడు చెరువు దగ్గిర దాచాడని గ్రహించాడు. నేరుగా చెరువుకు వెళ్లాడు. చెరువులో ఒకప్రాంతాన కప్పల అలికిడి లేదు. అక్కడే వెతికి లంకెబిందెలను పట్టుకున్నాడు కన్నడు. వాటిని భుజానపెట్టుకుని నేరుగా స్వగ్రామానికి బయలుదేరాడు.

చిన్నడు కొద్దిసేపట్లోనే నిద్రలేచాడు. పక్కన కన్నడు లేకపోవటం చూశాడు. చెరువుకు పరిగెత్తి తానుదాచిన లంకెబిందెల కోసం వెతికాడు. అవీ లేవు. కన్నడు వాటిని తీసుకుని స్వగ్రామానికి బయలుదేరి ఉంటాడని గ్రహించి అటుకేసి పరిగెత్తసాగాడు.

చిన్నడి పనేనని రూఢిచేసుకుని కన్నడు చకచకా నడిచి, కొద్దిసేపట్లోనే చిన్నడి ఇంటికి వెళ్లాడు.

చిన్నడి ఇంట్లోకి అడుగుపెట్టేసరికి ఏడుపులూ, పెడబొబ్బలూ వినిపించాయి. కన్నడు ఆశ్చర్యపోయి ఏమిటని అడిగాడు.

అందుకు చిన్నడి భార్యా, కొడుకూ శోకాలుపెడుతూ, చిన్నడు చచ్చిపోయాడని చెప్పారు. గుడ్డకప్పి నట్టింటో పడుకోబెట్టిన చిన్నణ్ణికూడా చూపించారు.

కాస్సేపు కన్నడుకూడా వాళ్లతోబాటు ఏడిచి, ఈ విధంగా అన్నాడు :

"ఇద్దరం ఎంతో స్నేహంగా ఉండే వాళ్లం. ఇక చిన్నడి ఆఖరుకోరిక తీర్చటం తప్ప నే చేయగలిగిందేమీ లేదు. తాను నాకన్న ముందు చచ్చిపోతే తన శవాన్ని కొట్టేసిన కండిచేనులో కందిమోళ్ళమీదిగా లాగమని నన్ను కోరాడు. వాడి ఆఖరు కోరిక తీరుస్తాను!"

ఈ మాటలంటూ కన్నడు చిన్నడి శరీరాన్ని భుజాన వేసుకుని, ఎవరిమాటలూ వినిపించుకోకుండా, కొట్టిన కందిచేనుదగ్గిరికి తీసుకుపోయాడు.

నేలలో పాతిన కత్తుల్లాగా ఉన్న కంది మోళ్ళు చూసేసరికి చిన్నడికి నిజంగానే ప్రాణంపోయినంత పని అయింది. ఊరుకుంటే నిజంగానే తనను కందిమోళ్లమీదగా లాగుతాడని అతడికి భయం కలిగింది.

చిన్నడు చప్పున లేచి కన్నడికాళ్ళు పట్టుకుని, "అన్నా, నన్ను మన్నించు! మనం దొంగబతుకు చాలించి నీతిగా బతుకుదామనుకున్నాంగదా. ఇంక దొంగబుద్ధులు మాత్రం దేనికి? రెండు బిందెలున్నాయి. చెరొకటీ తీసుకుని ఆ ధనంతో హాయిగా జీవింతాం!" అన్నాడు.

లంకెబిందెలను కన్నడూ చిన్నడూ సమంగా పంచుకుని ధనవంతులై సుఖంగా కాలం వెళ్ళబుచ్చారు.





# బంగారు ఎలుక

ప్రతిష్ఠాన దేశంలో సుప్రతిష్ఠితం అనే గొప్ప నగరం ఉండేది. ఆ నగరంలో ఒక వైశ్య స్త్రీ ఉండేది. ఆమె భర్త చనిపోగానే దాయాదులు అతని ఆస్తి యావత్తూ కాజేశారు. భర్త పోయేనాటికి ఆమె గర్భవతిగా వుండి, అనంతరం ఒక కుమారుణ్ణి కన్నది. ఆమె అష్టకష్టాలుపడి ఆ కొడుకును యెలాగో పెంచి, పెద్దజేసింది. కొడుకు పెద్దవాడయాక తల్లి వాడితో ఈవిధంగా చెప్పింది:

"నాయనా, నీవు కోమటి బిడ్డవు. వ్యాపారం మన కులవృత్తి. దురదృష్టవశాత్తూ నీవు అగర్భదరిద్రుడవు. అందుచేత వ్యాపారానికి అవసరమైన పెట్టుబడి ధనం లేదు. అయితే ఈ నగరంలో ధనగుప్తుడు అనే కోటీశ్వరుడున్నాడు. పేద కోమటి బిడ్డలకు సహాయంచేస్తాడు. ఆయున దర్శనం చేసుకొని పెట్టుబడికి ధనం తెచ్చుకో!" తల్లి చెప్పినట్టే ఆ కోమటిబిడ్డ ధనగుప్తుడిని చూడబోయాడు. ఆ సమయంలో ఆ కోటీశ్వరుడు మరొక యువకుణ్ణి కోప్పడుతున్నాడు:

"నీకు కొంచెమైనా వ్యాపారదక్షతలేదు. నీకు ఎన్నిసార్లో ధనసహాయం చేశాను. దానిమీద లాభం సంపాదించలేకపోగా నేనిచ్చినదికూడా పోగొట్టుకొన్నావు. తెలివిగలవాడైతే ఆ చచ్చిన ఎలుకను పెట్టుబడిగా చేసుకొని లక్షలు సంపాదించవచ్చు."

ఈ మాటలు వింటున్న కోమటి కుర్రవాడు గుప్తుడిని ధనం అడగలేదు. దూరాన చచ్చి పడిఉన్న ఎలుకను తీసుకొన్నాడు. దానిని తీసుకుపోయి ఒక వర్తకుడి పిల్లికి ఆహారంగా ఇచ్చి, దానికి ప్రతిఫలంగా రెండుదోసిళ్ళ శెనగలు పుచ్చుకొన్నాడు. వాటిని వేయించి కారపు శెనగలు చేసి, ఒక మంచినీళ్ళ కుండ తీసుకొని, ఊరిబయటికి వెళ్ళి ఒక చెట్టునీడను కూర్చున్నాడు.

వి. ఆదికేశవులు

మిట్టమధ్యాన్నంవేళ అడివిలో కట్టెలు కొట్టుకొని వచ్చేవాళ్లు అక్కడికి వచ్చి ఆ చెట్టునీడనే కాస్సేపు విశ్రాంతితీసుకున్నారు. కోమటికుర్రవాడు వారి యోగక్షేమాలు విచారించి, తలా కాసిని కారపుశెనగలు పంచిపెట్టి తాగేటందుకు మంచినీరిచ్చాడు. అందుకు వారు సంతోషించి తలా రెండు కట్టెలూ కుర్రవాడికిచ్చి వెళ్ళిపోయారు.

ఈ విధంగా సంపాదించిన కట్టెలు చిన్న మోపు కట్టి కుర్రవాడుకూడా నగరంలోకి తిరిగివచ్చి, వాటిని అమ్మి, ఆ డబ్బులో కొంత పెట్టి మళ్ళీ శెనగలు కొన్నాడు. ఇలా కొన్నాళ్ళు జరిగాక అతను కట్టెల మోపులే కొనదగినంత ధనం కూడబెట్టాడు. తరువాత కారపుశెనగల బేరం మాని కట్టెలమోపులు కొని భద్రంచేశాడు. ఇంతలో వర్షాకాలం వచ్చింది. కట్టెలకు గిరాకీ హెచ్చింది. తాను కొన్న కట్టెలన్నీ అమ్మేసి ఆడబ్బుతో చిల్లరదుకాణం పెట్టాడు.

చిల్లరవ్యాపారం రానురాను పెద్ద వర్తకంగా పరిణమించింది. వర్తకాన్ని బాగా పెంచుకొని, దానిమీద వచ్చే లాభాలతో ఇళ్ళూవాకిళ్ళూ, తోటలూదొడ్లూ కొని కాల క్రమాన ఆ కోమటిబిడ్డ లక్షాధికారి అయి నాడు. అతని సంపదకు మూలం ఎలుక కనుక అందరూ అతన్ని 'ఎలుకసెట్టి' అని పిలవసాగారు.

ఎలుకసెట్టి ఒకనాడు బంగారంతో ఒక ఎలుకను చేయించి దానిని తీసుకొనివెళ్లి ధనగుప్తుడికి సమర్పించి, "అయ్యా, ఇది మీరు నాకు చూపినపెట్టుబడి. దీనివల్ల నేను చాలా ధనం గడించాను. వడ్డీతోసహా దీనిని మీకు తిరిగి ఇస్తున్నాను," అన్నాడు.

ఎలుకసెట్టి కథ యావత్తూ విని ధనగుప్తుడు అతని తెలివితేటలకూ, సద్బుద్ధికీ సంతోషించి, తన కుమార్తెను అతనికిచ్చి పెళ్లిచేస్తూ, ఆ బంగారుఎలుకనే అల్లుడికి కానుకగా ఇచ్చాడు.






# తెలివి గల పిల్ల

ఒకనాడు కాశ్మీరులో ఒక చేపలమ్ముకునేది రాజభవనానికి వెళ్ళింది. రాణిగారు చేపలు బేరం చేస్తూండగా బుట్టలోని చేపల్లో ఒకటి ఎగిరెగిరి పడసాగింది.

"నాకు ఆడచేపలు కావాలి. ఆ చేప మగదా, ఆడదా?" అని రాణిగారు అడిగింది.

రాణిగారు ఆ మాట అడగగానే చేప పెద్దగా నవ్వింది. చేపలమ్మే మనిషి తన దగ్గిర అన్నీ మగచేపలేనని చెప్పింది. రాణి ఆ మనిషిని పంపేసింది. కాని తనను చూసి ఒక చేప నవ్వటమా అన్న ఆగ్రహంతో రాణిగారు కోపగృహం ప్రవేశించింది.

రాజుగారు ఆమె కోపకారణం తెలుసుకొన్నారు. మంత్రిని పిలిపించారు. "ఒక సామాన్యపు చేప రాణిగారిని చూసి నవ్విందట. దీనికి కారణం ఏమిటో నెల లోగా తెలుసుకోలేనిపక్షంలో నీతల తీయించేస్తాను," అని హెచ్చరించాడు.

మంత్రి గుండెల్లో రాయిపడింది. ఆయన విచారంతో ఇంటికి వెళ్ళాడు. ఎందరో మేధావులనూ, జ్యోతిషులనూ, యోగులనూ, మాంత్రికులనూ తన ఇంటికి రప్పించి, "ఒక సామాన్యపు చేప రాణీగారిని చూసి నవ్వింది. దీనికి కారణం ఏమైవుంటుందో మీరెవరైనా చెప్పగలరా?" అని అడిగాడు.

ఒక్కరూ చెప్పలేకపోయారు. దానితో మంత్రికి తనకు చావు తప్పదనిపించింది ఆయన మనోవ్యాధితో మంచమెక్కాడు.

మంత్రి కుమారుడు చాలా తెలివి గలవాడు. తండ్రికి కావలసిన సమాధానం కొరకు తానే స్వయంగా బయలుదేరాడు. అతను కొన్ని రోజులు ప్రయాణంచేశాక దారిలో ఒక ముసలి రైతు తటస్థపడ్డాడు. ఆ రైతుతోబాటే మంత్రి కుమారుడుకూడా నడవసాగాడు.

జి. సత్యనారాయణశర్మ



కొంతదూరం పోయాక మంత్రి కుమారుడు రైతుతో, "మనం ఇలా నడిచేకన్న ఒకరి భుజాలమీద ఒకరిని మోసుకుంటూ పోతే ఇద్దరికీ నడక సులువవుతుందిగదా! ఏమంటావు?" అన్నాడు.

రైతు సమాధానం చెప్పలేదు. తన వెంట వచ్చే కుర్రాడికి మతి సరిగా లేదు కాబోలని మాత్రం అనుకున్నాడు.

మరికొంత దూరం పోయాక మంత్రి కుమారుడు కోతకు సిద్ధంగా వున్న చేనొకటి చూసి, "దీనినింకా తినివెయ్యలేదేమబ్బా?" అని అడిగాడు. దానికి రైతు జవాబు చెప్పలేదు. ఈ మాటతో రైతు అనుమానం మరింత ఎక్కువయింది.

ఇంకొంత దూరం పోయాక ఒక అడవి వచ్చింది. మంత్రి కుమారుడు రైతుకు తన బాకు తీసి యిచ్చి, "ఇది తీసుకుపోయి రెండు గుర్రాలు తీసుకురాగలవా? మనకు ఉపయోగపడతాయి. బాకుమాత్రం పోగొట్టవద్దుసుమా! చాలా ఖరీదైనది," అని చెప్పాడు.

దానికికూడా రైతు ఏమీ జవాబు చెప్పలేదు. తనతో ఈవిధంగా మాట్లాడే కుర్రవాడికి నిజంగా పిచ్చేనని రూఢి మాత్రం చేసుకున్నాడు.




అడివి దాటి ఇద్దరూ ఒక నగరం ప్రవేశించారు. ఆ నగరంలోని వారెవరూ వీరిని పలకరించలేదు. మంత్రి కుమారుడు చుట్టూ చూస్తూ, "ఎంతపెద్ద శ్మశానమో!" అన్నాడు. ఈమాటకు రైతు నవ్వుకున్నాడు.

నగరం దాటుతూనే వారిద్దరూ శ్మశానం దగ్గిరికి వచ్చారు. శ్మశానంలో శవదహనం జరుగుతోంది. చచ్చిపోయినవాడి బంధువులు వచ్చే పోయేవారికి ఏవేవో తినుబండారాలిస్తున్నారు. వీరిద్దరికీకూడా ఇచ్చారు.

రెండడుగులువేసి మంత్రి కుమారుడు, చుట్టూ కలయజూసి, "ఇది ఎంత దివ్యమైన నగరం!" అన్నాడు.



కొద్దిదూరంలో వాగు ఒకటి అడ్డొచ్చింది. రైతు చెప్పులు చేతపట్టుకొని, ధోవతి పైకి కట్టుకొని వాగు దాటాడు. మంత్రి కుమారుడు మటుకు ఇదేదీ చేయకుండానే వాగు దాటాడు.

ఎలాగైతేనేం రైతు గ్రామం చేరుకున్నాడు. తనవెంట వచ్చిన యువకుడు ఎంత వెర్రివాడైనా, చాలా దూరం తన వెంట కలిసి నడిచాడుగనక రైతు అతన్ని తన యింటికి భోజనానికి రావలసిందిగా పిలిచాడు.

దానికి మంత్రికుమారుడు, "మీ ఇంటికి అలాగే వస్తానుగాని మీ యింటి వాసాలు బలమైనవో కావో ఆలోచించుకుని మరీ పిలవండి!" అన్నాడు.

"ఈ పిచ్చివాడితోటి మాట్లాడటమే తప్పు!" అనుకొని రైతు తానొక్కడే ఇంటికి వెళ్ళాడు. తన భార్యకూ, బిడ్డలకూ తన వెంట వచ్చిన పిచ్చి కుర్రవాణ్ణి గురించిన సంగతి వివరంగా చెప్పాడు.

రైతుకూతురు చాలా తెలివిగలది. తండ్రి చెప్పినదంతా విన్నతరవాత ఆ పిల్ల అతడితో ఈ విధంగా అన్నది:

"నాన్నా, ఆ కుర్రవాడు పిచ్చివాడు కాడు. చాలా తెలివిగలవాడు. అందుకే అతని మాటలు నీ కర్థంకాలేదు. ఒకరి భుజాలమీద ఒకరిని మోసుకుంటూ పోదామనటంలో అతని ఉద్దేశం ఒకరికొకరు కథలు చెప్పుకుంటూ నడుద్దామని! పొలాన్నింకా తినివెయ్యలేదే మబ్బా అంటే, రైతులకు సామాన్యంగా ఉండే అప్పుల వాళ్లు పంట కాజెయ్యలేదేమిటా అని! బాకు తీసుకుపోయి రెండు గుర్రాలు తీసుకురమ్మనటంలో అతని ఉద్దేశం రెండు దుడ్డుకర్రలు నరుక్కురమ్మనీ, అవి అడవిలో ఏదైనా వస్తే అండగా ఉంటాయనీనూ! నగరంలో ఎవరూ పలకరించనందున అది అతనికి శ్మశానంలా కని



పించింది; శ్మశానంలో ఆతిథ్యం దొరికింది గనక దాన్ని నగరం అన్నాడు! వాగు దాటేటప్పుడు నీటిలో ఏముంటుందో తెలీదు గనక అతను పాదరక్షలు విప్పలేదు, ధోవతి పైకికట్టలేదు! అతను చాలా తెలివైనవాడు. మనయింటి వాసాలు బలమైనవని చెప్పిఉంటే తప్పక వచ్చేవాడు. ఇల్లు తనను భరిస్తుందో లేదోనని తెలుసుకొనడానికే ఆయన అలా అడిగాడు. నే నాయనకు ఆతిథ్యం ఇస్తానుండు!"

రైతుకూతురు ఒక చిన్న గిన్నెనిండా నెయ్యీ, పన్నెండు చపాతీలూ, ఒక దుత్త నిండా పాలూ, నౌకరుచేతికిచ్చి ఊరిబయట ఉన్న మంత్రికుమారుడికి పంపిస్తూ ఒక చిన్న ఉత్తరంలో ఈ విధంగా రాసింది:

"మిత్రమా, చంద్రుడు సంపూర్ణుడు. సంవత్సరానికి పన్నెండు నెలలు. సముద్రుడు చెలియలికట్టను దాట యత్నిస్తున్నాడు."

రైతుకూతురిచ్చిన వస్తువులను నౌకరు మంత్రికుమారుడివద్దకు తీసుకు పోతూండగా, నౌకరుకొడుకు దారిలో తటస్థపడి, తండ్రివద్ద మారాంచేసి కొంత పదార్థం కాజేశాడు. నౌకరు మిగిలినవాటిని తీసుకు పోయి మంత్రికుమారుడి కిచ్చాడు.

మంత్రికుమారుడు భోజనం పూర్తిచేసి, రైతుకూతురు పంపిన చీటి తీసుకొని, దానికి సమాధానం నౌకరుద్వారా పంపాడు:

"స్నేహితురాలా! అమావాస్య చంద్రుడు కావటంచేత అతని జాడేతెలియదు. ఏడాదికి పదకొండు మాసాలేనని నాకుతోస్తోంది. సముద్రంలో నీరు సగానికి తీసివుంది."

ఈ సమాధానం వినగానే రైతుకూతురు నౌకరుతో, "నేనిచ్చిన నెయ్యీ, ఒక చపాతీ, సగం పాలూ ఏంచేశావు?" అని అడిగింది. దొంగతనం బయటపడిపోయింది.

అతరవాత ముసలిరైతు వెళ్ళి మంత్రికుమారుణ్ణి తన యింటికి పిలుచుకొని

వచ్చాడు. మంత్రి కుమారుడూ, రైతు కూతురూ చాలాసేపు మాట్లాడుకున్నారు. చివరకు మంత్రి కుమారుడు రైతు కూతురుతో, రాణీగారిని చూసి చేప నవ్విన వృత్తాంతం పూసగుచ్చినట్టు చెప్పి, "ఆ చేప అలా నవ్వటానికి కారణం ఏమై వుంటుంది?" అని అడిగాడు.

"రాణీగారి అంతఃపురంలో యెవరికీ తెలియకుండా ఒక పురుషుడు నివసిస్తూ ఉండాలి!" అన్నది రైతు కూతురు.

మంత్రి కుమారుడు ఆశ్చర్యపడి, "ఈ విషయం నిజమైతే రుజువు చేయటానికి నువు తోడ్పడగలవా? నా తండ్రి ప్రాణం కాపాడినదానవవుతావు!" అన్నాడు.

సరేనని రైతు కూతురు మంత్రి కుమారుడివెంట బయలుదేరింది. ఇద్దరూ ఇంటికి తిరిగివచ్చారు. రైతు కూతురు చెప్పిన మాటలు విని మంత్రి సంతోషించి రాజుతో చేప నవ్వుకుగల కారణం చెప్పేశాడు.

"దీనికి రుజువు?" అని అడిగాడు రాజు.

"రాజనగరులో ఒక వెడల్పయిన కందకం తవ్వించండి. దానిమీదుగా రాణీగారి పరిచారికలను దూకమని శాసించండి" అని సలహా ఇచ్చింది రైతుకూతురు.

ఆప్రకారంగానే కందకం తవ్వి రాణీగారి దాసీలందరినీ దూకమన్నారు. ఎవరూ దూకలేకపోయారు. ఒకతెమాత్రం ధైర్యంగా ముందుకువచ్చి దూకింది.

"ఆ మనిషి స్త్రీ కాదు. పరీక్షించండి," అన్నది రైతు కూతురు. ఆమె చెప్పినట్టే రుజువయింది. ఆ మనిషి స్త్రీకాదు, స్త్రీ వేషంలో అంతఃపురంలో ప్రవేశించిన పురుషుడు. మోసాన్ని బయటపెట్టినందుకు రాణీగారు చాలా సంతోషించింది. ఆ పురుషుణ్ణి తగినవిధంగా శిక్షించారు.

రాజుగారు మంత్రికి గొప్ప బహుమతి ఇచ్చి, మంత్రి కుమారుడికీ, రైతు కూతురుకూ వైభవంగా వివాహం జరిపించారు.






## 12

[సమరసేనుడు తన సైనికులతో పారిపోసాగాడుకదా? కొంతసేపటికి కుంభాండుడు తమను వెన్నాడుతున్నట్టు గ్రహించాడు. సైనికులను చెట్లమీద కాపుపెట్టి, ఒంటరిగా ఒక గుహలో కూర్చున్నాడు. గుహవెనుకభాగాన ఒక రహస్యద్వారం వుంది. దానిని సమరసేనుడు తెరవటంతో ఇద్దరు బలిష్ఠులు హఠాత్తుగా లోపలకువచ్చి అతణ్ణి బంధించారు. తరవాత—]

హఠాత్తుగా ఇద్దరు బలిష్ఠులు తనమీదకు దూకేసరికి సమరసేనుడు తబ్బిబ్బయాడు. అతడి నోట మాట రాలేదు. ఇంతలో గుహ ముందునుంచి భయంకరమైన సింహగర్జన వినబడింది. మరుక్షణంలోనే సమరసేనుణ్ణి బంధించిన ఇద్దరూ అతణ్ణి భుజాలమీద వేసుకుని అక్కడినుంచి పారిపోసాగారు.

సమరసేనుడు చేయగలిగిందేమీ లేక ఆ ప్రాంతాన్ని పరీక్షగా చూస్తున్నాడు. అదంతా ఒక కొండ లోయలాగా ఉంది. తనను బంధించిన ఇద్దరు వ్యక్తులూ కొండ మిట్ట మీంచి పల్లానికి దిగుతున్నారు. దూరంగా ఎక్కడో మినుకుమినుకుమని దీపాలు మెరుస్తున్నాయి.

"మీరెవరు? నన్నెందుకు బంధించారు?" అని అడిగాడు సమరసేనుడు.

అందుకు ఆ ఇద్దరూ మొహమొహాలు చూసుకొని మాట్లాడకుండా ఊరుకున్నారు. సమరసేనుడు అదే ప్రశ్నను తిరిగీ అడిగాడు. అప్పుడు వాళ్ళల్లో ఒకడు-"అదంతా మా నాయకుణ్ణి అడిగితే చెపుతాడు!". అని మాత్రం జవాబిచ్చాడు.





జవాబుగా మరికొన్ని కేకలు వినబడినై. ఇదంతా ఆశ్చర్యాన్నేగాక, భయాన్నికూడా కలిగించింది సమరసేనుడికి.

చివరకు అతణ్ణి ఆ ఇద్దరూ ఒక ఇంటికి తీసుకుపోయారు. తలుపు తట్టగానే అది తెరవబడింది. సమరసేనుణ్ణి ఒక గది లోకి తీసుకుపోయి కాళ్ళూ, చేతులూ తాళ్ళతో కట్టి–"ఈ రాత్రికి యిదే నీ పడక గది. తెల్లవారినతర్వాత వుంది ముసళ్ళ పండగ" అంటూ వెళ్ళిపోయారు.

సమరసేనుడికి ఆ రాత్రి నిద్రపట్టలేదు. తనను ఈ కొత్తవాళ్ళు ఎందుకు బంధిం చారో ఎంత ఆలోచించినా అతడికి అర్థం కాలేదు. ఈ ద్వీపంలో తనూ, కుంభాం డుడే కాక, తమవలె కొంత నాగరికులైన మరొక జాతివాళ్ళుకూడా నివసిస్తున్నారని మాత్రం అతడు ఊహించాడు. తనను బంధించినవాళ్ళ వేషభాషలు చూస్తే, వాళ్లు ఆటవికులు కాదని తెలుస్తూనేవుంది.

దారీ తెన్నూ లేని ఆలోచనలతో సమర సేనుడు ఆ రాత్రంతా ఆ చీకటిగదిలో గడిపాడు. తెల్లవారవచ్చిన సూచనగా కోడి కూతలు వినబడసాగినై. కొద్దిసేపటితర్వాత గుడిగంటలు మోగుతున్న శబ్దంకూడా విన బడింది. అవెంటనే అడుగుల చప్పుడూ,

ఆ జవాబుతో ఇక వాళ్ళను ప్రశ్నించి లాభం లేదనుకున్నాడు సమరసేనుడు. కొండమిట్ట ప్రదేశాన్నుంచి లోయలోకి దిగ గానే ఆ ఇద్దరూ సమరసేనుణ్ణి కిందకు దింపి, చేతులకూ కాళ్లకూ కట్టిన కట్లు విప్పేశారు. తరవాత సమరసేనుణ్ణి మధ్యను ఉంచి అటూ ఇటూ వాళ్ళు నడుస్తూ ముందుకు పోసాగారు.

అలా కొంతదూరం వెళ్ళేసరికి దీపాల కాంతి దగ్గరయింది. చెట్టుమీద కావలి కూర్చున్న ఒకడు, "మిత్రులు ఎవర్నో బంధించి తెస్తున్నారు. దారి యివ్వండి!" అంటూ పెద్దగా కేకపెట్టాడు. ఆ కేకకు



కొద్దిసేపట్లో కిర్రుమంటూ తలుపు తెరుచుకోవటం జరిగింది.

సమరసేనుడు అటుకేసి చూశాడు. ఇద్దరు కొత్తవాళ్లు కత్తులు ధరించి కోర చూపులు చూస్తూ సమరసేనుడిదగ్గిరకు వచ్చారు. సమరసేనుడు నిర్భయంగా వాళ్ళకేసి చూస్తూ—

"ఆ మోగినది గుడిగంటలేనా?" అని వాళ్లను అడిగాడు.

అందుకు ఆ కొత్తవాళ్ళల్లో ఒకడు నవ్వుతూ, "అవి గుడిగంటలు కాదు, చావు బాజాలు. వ్యాఘ్రదత్తుడు అడిగినదానికి సరిఅయిన జవాబు ఇవ్వకపోయావో... నేటితో నీకు నూరేళ్ళుజీవితం నిండినట్టే. జాగ్రత," అన్నాడు.

వ్యాఘ్రదత్తుడెవరు? తననుంచి అతడు తెలుసుకోగోరుతున్న రహస్యం ఏమిటి? ఇలాంటి ప్రశ్నలకు సమరసేనుడికి జవాబు దొరకలేదు. కోరచూపులుచూస్తూ, క్రూరాతిక్రూరుల్లా వున్న వ్యాఘ్రదత్తుడి అనుచరులను అడిగినా లాభం లేదని సమరసేనుడు దృఢపరుచుకున్నాడు.

సమరసేనుడి కట్లు విప్పబడినై. వ్యాఘ్రదత్తుడి సేవకులు అతణ్ణి గదినుంచి బయటకు తీసుకువచ్చారు. "నన్ను ఎక్కడికి తీసుకుపోతున్నారు?" అని వుండ







అంతలో ఒక పెద్ద తలుపు తెరవ బడింది. ఎదురుగా ఒక ఎత్తయిన పీఠం మీద వ్యాఘ్రదత్తుడు కనిపించాడు. సమర సేనుణ్ణి చూస్తూనే నవ్వుతూ—

"సమరసేనా, నీకు వ్యాఘ్రమండలం తరఫున అభివందనాలు చెపుతున్నాను. బహుశా నీ పూర్వులూ, నా పూర్వులూ కుండలినీద్వీపంలో ఒకే పట్టణవాసులై ఉండవచ్చు. ఇక్కడ—ఈ మంత్రాల దీవిలో వారి సంతానమైన మనం యిలా కలుసుకోవటం నీకు ఆశ్చర్యంగా లేదా?" అని అడిగాడు.

సమరసేనుడికి తను బంధింపబడిన దగ్గరనుంచి జరుగుతున్న ప్రతి సంఘటనా ఆశ్చర్యంగానే కనబడుతోంది. తనను ఎవరు ఎందుకు బంధించారనేది ఒక ఆశ్చర్యకరమైన సంగతి. కుండలినీద్వీపం పేరుకూడా చెప్పి, తమ పూర్వీకుల నివాస స్థానాల మాట గుర్తుచేస్తున్న ఈ వ్యాఘ్ర దత్తుడి ధోరణికూడా ఆశ్చర్యంగానే వుంది.

బట్టలేక అడిగాడు సమరసేనుడు. అందుకు వాళ్ళు "నిన్ను మా నాయకుడైన వ్యాఘ్ర దత్తుడివద్దకు తీసుకుపోతున్నాం. ఒళ్లు దగ్గరపెట్టుకొనిమాత్రం ప్రవర్తించు. తెలి సిందా?" అని గద్దించారు.

కొంతదూరం నడిచి అందరూ ఒక పెద్ద భవనంలో ప్రవేశించారు. అక్కడ రకరకాల ఆయుధాలు ధరించిన చాలా మంది సైనికులు కనిపించారు.

వాళ్లను చూస్తూనే, 'వీళ్లు సైనికులు కారు. మాటల తీరూ, వేషాలూ చూస్తే వట్టి బందిపోటు గుంపులా వుంది,' అను కొన్నాడు సమరసేనుడు తనలో.

"నాకు ప్రతిదీ ఆశ్చర్యాన్నే కలి గిస్తోంది," అన్నాడు సమరసేనుడు నిబ్బ రంగా. "నన్ను మీ అనుచరులు ఎందుకు బంధించినట్టు? మీవద్దకు ఎందుకు తీసుకు వచ్చినట్టు? అసలు మీరు ఈ ద్వీపానికి








ఎప్పుడు వచ్చారు? నాకన్నీ వింతగానే కనబడుతున్నయి!" అంటూ ముగించాడు సమరసేనుడు.

"సమరసేనా! ఇందులో నువ్వు ఆశ్చర్య పడవలసిందేమీలేదు. శమనద్వీప రాజైన శాక్తేయుడు దేశాలమీద దండెత్తి మన కుండలినీద్వీపాన్నికూడా దోచుకున్నాడు. మన పూర్వుల్లో దృఢకాయులైన కొందరిని బానిసలుగాకూడా పట్టుకొని, మరికొన్ని ద్వీపాలను దోచుకునేందుకు ఓడల్లో బయలుదేరాడు. ఈ ద్వీపంలో అతడు మృత్యువు పాలయ్యాడని నీకూ తెలుసుననుకుంటాను. బానిసలుగా బంధింపబడిన మనపూర్వులు స్వేచ్ఛ పొంది, ఈ ప్రాంతాల్లో నివాసం ఏర్పరుచుకున్నారు. మనవాళ్లు స్వేచ్ఛ పొందటానికి, శాక్తేయుడి శిష్యులైన ఇద్దరు మాంత్రికులమధ్య చెలరేగిన ద్వేషం కొంత సహాయం చేసింది. వాళ్లను నీవు ఎరుగుదువుకదా?" అని అడిగాడు వ్యాఘ్రదత్తుడు.

"ఎరుగుదును!" అని వెంటనే జవాబు చెప్పాడు సమరసేనుడు. అతడికి వ్యాఘ్రదత్తుడు చెపుతున్నదంతా నిజంగా కనబడుతున్నా, ఆశ్చర్యంకూడా కలిగిస్తోంది.

"ఐతే యిప్పుడు చెప్పు, ఆ శాక్తేయుడి త్రిశూలం ఎక్కడ వుంది? చండీదేవి ప్రసాదితమైన ఆ త్రిశూలం శక్తి నీవు వినే వుంటావు? మరి దానిసంగతేమిటి?" అని అడిగాడు వ్యాఘ్రదత్తుడు.

ఆ ప్రశ్నతో సమరసేనుడు నివ్వెర పోయాడు. వ్యాఘ్రదత్తుడు, శమనద్వీప రాజయిన శాక్తేయుణ్ణిగురించి చెప్పిన సంగతులేవీ సమరసేనుడికి తెలియవు. చతుర్నేత్రుడు ఒకసారి తమ గురువైన శాక్తేయుడినిగురించి కొంత చెప్పాడు. శాక్తేయుడు కుండలినీద్వీపాన్ని దోచుకున్న సంగతి తను వినలేదు. చండీదేవి, శాక్తేయుడికి ప్రసాదించిన త్రిశూలంసంగతి అతడికి మొదలే తెలీదు.







"వ్యాఘ్రదత్తా! మీరడిగే ప్రశ్నలలో వేటికీ నేను జవాబివ్వలేను. మీరు నన్ను పొరపాటుబడి బంధించివుంటారు. శాక్తేయుణ్ణిగురించిగానీ, అతడి దివ్యశక్తిబలంగల త్రిశూలంసంగతిగానీ నాకు తెలియదు," అన్నాడు సమరసేనుడు.

వ్యాఘ్రదత్తుడు, సమరసేనుడి జవాబు విని మండిపడ్డాడు. "నువ్వు అమాయికుడిలా నటించి నన్ను మోసగించలేవు. నీకు రేపు ఉదయం పదిగంటలవరకూ అవకాశం యిస్తున్నాను. ఈలోపల బాగా ఆలోచించుకుని నిజంచెప్పటం నీకు శ్రేయస్కరం. లేకపోతే నిన్ను చిత్రవధ చేసి భద్రచాముండికి ఆహారంగా వేస్తాను. నిన్ను రక్షించేవాళ్ళెవరూలేరు," అంటూ భీకరంగా అరిచాడు.

సమరసేనుడు నిశ్చేష్టుడైపోయాడు. తన కేమాత్రం తెలియని సంగతులు చెప్పమని బలవంతపెడుతున్నాననేది వ్యాఘ్రదత్తుడికి తెలియదని సమరసేనుడు గ్రహించాడు. అయినా తన మాటల్లో వ్యాఘ్రదత్తుడికి నమ్మకం కలిగించటం సాధ్యమయ్యే పని కాదు.

వ్యాఘ్రదత్తుడి ఆజ్ఞ విని ఇద్దరు భటులు సమరసేనుణ్ణి అక్కడినుంచి ఒక చీకటి గదికి తీసుకుపోయారు. అక్కడ అతడి కాళ్లూ చేతులూ కట్టి నేలమీద పడవేశారు. ఒకపక్కగా భయంకరరూపి అయిన భద్ర చాముండివిగ్రహం వుంది. భటులు సమరసేనుడికి ఆ విగ్రహాన్ని చూపుతూ—

"రేపు పదిగంటలలోగా, మా నాయకుడికి నిజం చెప్పకపోయావంటే, నీవు ఈ దేవికి బలికాక తప్పదు. ఆలోచించుకో," అంటూ అక్కడినుంచి వెళ్లిపోయారు.

సమరసేనుడు ఆకలిబాధతో, కాళ్ళూ చేతులా కట్లవల్ల కలిగే నొప్పితో నానా యాతనా పడసాగాడు. తెల్లవారితే తనకు మరణం తప్పదని తోచింది. ఇటువంటి





ఆపత్సమయంలో చతుర్నేత్రుడు తప్ప తనకు సహాయపడగలవాళ్లు ఎవరూ లేరు. కాని చతుర్నేత్రుడికి తను అపాయంలో చిక్కుకున్నట్టు తెలియటం ఎలా?

సమరసేనుడు ఇలాంటి ఆలోచనలతో బాగా రాత్రిపోయేవరకూ కదలామెదలక వుండిపోయాడు. బాగా నడిరేయివేళకు ఎవరో గదితలుపు తెరిచిన శబ్దం అయింది. సమరసేనుడు అటుకేసి చూశాడు. కత్తులు ధరించిన ఇద్దరు దృఢకాయులు లోపలకు వచ్చారు. బహుశా తనను హింసించేందుకు వస్తున్న వ్యాఘ్రదత్తుని భటులైవుంటారని సమరసేనుడు భావించాడు.

ఆ కొత్తవాళ్లిద్దరూ సమరసేనుడివద్దకు వచ్చి కట్లు విప్పారు. ముందు ఏమి జరుగుతుందా అని ఆశ్చర్యపడుతూ చూస్తున్న సమరసేనుణ్ణి తమవెంట రావలసిందిగా సౌజ్ఞచేసి, వాళ్ళిద్దరూ వేగంగా ముందు నడవసాగారు.

వాళ్ళు కొంతదూరం వెళ్లేసరికి ఎదురుగా వస్తున్న వ్యాఘ్రదత్తుడి అనుచరులిద్దరు కనిపించారు. వెంటనే సమరసేనుడి వెంట నున్నవాళ్లు అతణ్ణి చెయ్యిపట్టుకుని పక్కన వున్న చీకటిలోకి లాగుతూ—

"మేము మీ స్నేహితులం. వ్యాఘ్రదత్తుడి సేవకులు గస్తీ తిరుగుతున్నారు. మనం ఈ చీకట్లో నిలబడి వాళ్ళు దగ్గరకు రాగానే హఠాత్తుగా మీదపడి హతమార్చాలి. కనక సిద్ధంగా వుండు," అని చెప్పారు.

కాసేపటికల్లా వ్యాఘ్రదత్తుడి గస్తీ వాళ్ళిద్దరూ ఆ సమీపానికి వచ్చారు. చీకటిలో పొంచివున్న సమరసేనుడూ, అతడి మిత్రులిద్దరూ వాళ్ళమీదకు దూకి కిక్కురుమనకముందే గొంతులు నులిమి, ఆ పక్కనవున్న పాడుబావిలో పారేశారు.

ఆ తరవాత వాళ్ళు కొండదారులవెంట నడిచి, సరిగా సూర్యోదయంవేళకు ఒక చిన్న పల్లెచేరారు. —(ఇంకా వుంది)





# కురూపి భర్త

CHITRA

మిథిలానగరపు రాజుకు ఒక్కడే కుమారుడు. అతనిపేరు కుశుడు. అతను సకల శాస్త్ర పారంగతుడు, సకల సద్గుణ సమన్వితుడు. పరిసర దేశాలలో అతనికి అపారమైన కీర్తి ఉండేది. ఆ దేశాల రాజకుమారులు అతనికి ప్రాణస్నేహితులుగా ఉండేవారు. ఇన్ని ఉండికూడా కుశుడికి చక్కదనంలేదు. అతను కురూపి అన్న బాధ మరెవ్వరికి ఉండేదికాదు. కాని అతనుమాత్రం ఆ విషయం మరిచిపోలేక పోయేవాడు.

ఈ కారణంచేతనే అతను యుక్తవయసు వచ్చికూడా వివాహంమాట తలపెట్టలేదు. పెళ్ళాడి వంశం నిలబెట్టమని వృద్ధరాజు కుశుణ్ణి ఎన్నోసార్లు హెచ్చరించాడు. కాని ప్రతిసారీ కుశుడు:

"నావంటి కురూపిని ఏ రాజకన్య వరిస్తుంది?" అని అయిష్టంగా తండ్రికి సమాధానం చెప్పుతుండేవాడు.

"నీ పరిచయం అయినాక ఏ రాజకన్య నిన్ను ప్రేమించదు?" అని తండ్రి ఎదురు ప్రశ్నించేవాడు.

తండ్రి వొత్తిడినుండి బయట పడటానికి కుశుడొక యుక్తిచేశాడు. అతను స్వయంగా బంగారంతో ఒక అతి రూపసుందరి ప్రతిమ తయారుచేసి, అలాటికన్య దొరికితే తప్పక వివాహమాడుతానన్నాడు, అటువంటి కన్య ఎక్కడా ఉండదని కుశుడి విశ్వాసం.

కాని మూడుమూర్తులా అలాటిదే మగధ రాజు పెద్దకూతురు ప్రభావతి. కుశుడు తయారుచేసిన ప్రతిమలాటి కన్యలకోసం వెతుకుతూ నానాదేశాలు తిరిగి మగధకు వచ్చిన మిథిలరాజు దూతలు ఈ విషయం కనిపెట్టారు. మగధరాజుకు ఒకరు కాదు, ఎనిమిదిమంది కుమార్తెలున్నారు. మిథిల యువరాజు కుశుడి పేరు ప్రఖ్యాతులు అదివరకే వినిఉండటంచేత మగధరాజు సంతో

పి. ఆదినారాయణ



షంగా వివాహానికి ఒప్పుకున్నాడు. తనను చూడకుండానే తనలాటి ప్రతిమను తయారు చేసిన కుశుణ్ణి పెళ్ళాడటానికి ప్రభావతి కూడా ఉవ్విళ్ళూరింది.

కుశుడుమాత్రం కుంగిపోయాడు. అంత రూపవతిని తనకిచ్చి పెళ్లిచేయవద్దని అతడు తండ్రిని బతిమాలాడు. కాని వృద్ధరాజు వినిపించుకోలేదు.

"ఒక్క ఏడాది నీ భార్యగా ఉన్నమీదట ఆ ప్రభావతి నీకంటె అందగాడు ప్రపంచంలోనే లేడనుకుంటుంది. నామాటనమ్ము," అన్నాడాయన. అందుకు కుశుడు: "ఈ ఏడాదిలోగా?" అని ప్రశ్నించాడు.

వృద్ధరాజు ఒక ఉపాయం ఆలోచించాడు. "చూడు! పూర్వం మనవంశంలో ఒక పురాతన సంప్రదాయం ఉండేది. దాని ప్రకారం వధువు వివాహ సమయంలో వరుణ్ణి చూడటానికి వీల్లేదు. ఇప్పుడా ప్రకారమే నీ వివాహం జరిపిస్తాను," అన్నాడు రాజు.

"వివాహానంతరం?" అన్నాడు కుశుడు.

"దానికేముంది, ఒక ఏడాదిపాటు మీ పడకగదిలో దీపంలేకుండా నిషేధిస్తాను" అన్నాడు రాజు.

బలవంతాన కుశుడు వివాహానికి అంగీకరించాడు. అతనికీ ప్రభావతికీ పురాతన సాంప్రదాయానుసారం వివాహం జరిగింది. ప్రతిరాత్రీ కుశుడు చీకటిలో తన భార్య వద్దకు వచ్చేవాడు. ఆమెకు చిత్రవిచిత్రమైన గాథలు చెప్పేవాడు, చక్కని పాటలుపాడి వినిపించేవాడు.

తన భర్తయొక్క మంచితనానికీ, తెలివి తేటలకూ ప్రభావతి మురిసిపోయేది. కాని పన్నెండు మాసాలపాటు అతని ముఖం చూసి ఆనందించే అదృష్టం తనకు లేదని విచారించేది. ఈ విచారం నానాటికీ తీవ్రం కాసాగింది. తన భర్తముఖం చూడకుండా ఇంకొక్క గడియకూడా ఉండలేననిపిం

చింది. ప్రభావతి తనదాసీని పిలిచి, ఎలాగైనా తనకు తనభర్తను చూపినట్టయితే కోరిన బహుమానం ఇస్తానని ఆశపెట్టింది. దీనికి ఆశపడి దాసీది, ఒకనాడు కుశుడు వీధి ఊరేగుతుండగా ఒక కిటికీ చాటు నుంచి ప్రభావతికి చూపింది.

కుశుణ్ణి చూడగానే ప్రభావతికి తలతిరిగి పోయినట్టయింది. తనభర్త అంత అంద విహీనుడా? అబద్ధం! కాని, ఆ రాజ లాంఛనాలతో ఊరేగే అధికారం తనభర్తకు కాక ఇంకెవరికున్నది? అతను కురూపి కనుకనే పెళ్ళిలో అతనిముఖం తాను చూడకుండా చేశారు! అందుకనే తన శయన మందిరంలో దీపంలేకుండా చేశారు! ఎంత మోసం! ఎంత వంచన!

ప్రభావతికి పట్టరాని ఆగ్రహం కలిగింది. ఆమె తన వస్త్రాభరణాలుసర్దుకుని పుట్టింటికి వెళ్ళటానికి సిద్ధమయింది.

ఈ వార్త కుశుడికి తెలిసింది. అతను విచారంగా, "ఆమె ఇష్టంవచ్చినట్టు చేయ నివ్వండి!" అన్నాడు.

అన్నాడేగాని ప్రభావతి వెళ్ళిపోయినరోజు నుంచీ కుశుడికి జీవితం శూన్యంగా కనిపించసాగింది. అతనికి నిద్రాహారాలు లేకుండాపోయాయి. చివరకు అతను ఒక నాడు తన రాజవస్త్రాలు విసర్జించి సామాన్య





దుస్తులు ధరించి మగధకు ప్రయాణమై వెళ్ళాడు. ప్రభావతి మనసులో కలిగిన గాయాన్ని ఏవిదంగానైనా మాన్పి, తనపై ఆమెకు కనికరం కలిగేలాగు చేయాలని అతని ఉద్దేశం.

మగధచేరిన కుశుడు రాత్రివేళ రాజ భవనం పరిసరాలకు వెళ్ళి వేణువుపై కరుణాపూరితంగా వాయించేవాడు. ప్రభావతి ఆవేణునాదం విని అది తన భర్తదేనని గుర్తించింది. ఒకప్పుడా వేణునాదం విని తన్మయత్వంచెందిన ప్రభావతి, ఇప్పుడది చెవిని పడగానే మండిపడింది. తనకు ద్రోహంచేసినది చాలక తనను వెంబడించి అతను ఇక్కడికికూడా వచ్చాడని ఆమెకు ఆగ్రహం కలిగింది.

కుశుడు తన భార్యకు మరొకవిధంగా సందేశం పంపటానికి ఆలోచనచేశాడు. అత నొక కుమ్మరివద్దకు పోయి, "తాతా, నీవు తయారుచేసే కుండలకు చక్కగా రంగులు వేస్తాను. వాటిని తీసుకుపోయి రాజ భవనంలో ఇవ్వగలవా?" అని అడిగాడు.

"అది నీ పనితనాన్నిబట్టి వుంటుంది, నాయనా!" అన్నాడు కుమ్మరి.

కుశుడి పనితనం కొద్దిపాటిది కాదు. అతను రంగులూ, బొమ్మలూ వేసిన కుండ లనుచూసి రాజుగారు గొప్పగా మెచ్చుకొని, వాటిని కొని తన కుమార్తెలకు బహూకరించాడు. మిగిలిన రాజకుమార్తె లందరూ వాటిని చూసి ఆనందించారు. కాని ప్రభావతిమటుకు కుండపై తన చిత్తరువు చూడగానే అది తన భర్తచేసిన పనే అని తెలిసి మరింత ఆగ్రహంచెంది కుండను పగలగొట్టి పారవేయించింది.

ఈసారి కుశుడు తన భార్యకు మరింత దగ్గిరగా వెళ్ళే ఉపాయం ఆలోచించాడు. రాజుగారి వంటవాణ్ణి పట్టుకొని, "బాబూ, నేను కొత్తకొత్త వంటకాలుచేసి రాజుగారిని మెప్పించగలను. నావంట రుచిచూస్తే సీకు

కీర్తి, బహుమానమూ కూడా వస్తుంది. నాకేమీ జీతం అవసరంలేదు. నన్ను నీకింద పనిచెయ్యనియ్యి!" అని అడిగాడు. వంటవాడు సమ్మతించాడు.

మర్నాడు భోజనాల దగ్గిర రాజు కొత్త వంటకాలుచూసి పరమానందం చెందాడు. వాటిని అంతఃపురంలోని తన కుమార్తెల వద్దకు వెంటనే పంపమని ఉత్తరువుచేశాడు. కుశుడే స్వయంగా బంగారుపళ్ళెంలో భోజనంతీసుకొని ప్రభావతి వద్దకు వెళ్లాడు.

ప్రభావతి తన భర్తను గుర్తించింది. తన కొరకు అతను ఇన్నిపాట్లు పడుతున్నాడే అన్న కనికరంకూడా ఆమెకు కలగలేదు.

"నీచేతి భోజనం నా కవసరంలేదు. మరెవరి చేతనైనా పంపించు!" అన్నదామె ఎంతో నిర్దయగా.

తన భార్య హృదయం పాషాణమై పోయిందనీ, దానిని ద్రవింపజేసేశక్తి తనకు లేదనీ కుశుడు నిర్ధారణ చేసుకొన్నాడు. అతను మగధను విడిచి ఏ కాశీకైనా వెళ్ళి సన్యాసాశ్రమం స్వీకరించ నిశ్చయించాడు.

కాని ఈ నిశ్చయానికి వచ్చిన క్షణంలోనే ఒక దుర్వార్త రాజనగరులో కార్చిచ్చులా పాకింది. ఎవరో ఏడుగురు రాజులు మగధపై దండెత్తి వస్తున్నారట.



ప్రభావతి సౌందర్యంగురించీ, ఆమె భర్తను వొదిలేసిన విషయమూ విని, ఆమెను పెళ్ళాడటానికై వారీపని చేస్తున్నారట.

ఈవార్త విని మగధరాజు తల్లడిల్లిపోయాడు. తన ఒక్క సేనతో ఏడు సేనలను ఎట్లా ఎదుర్కోవటం? ఒకవేళ ప్రభావతికి మళ్ళీ వివాహం చేద్దామనే అనుకున్నా, ఏడుగురు రాజులున్నారు! ఏ ఒకరికి ఆమెనిచ్చినా మిగిలిన ఆరుగురూ శత్రువులౌతారు!

అందుకని మంత్రులనూ, సేనానాయకులనూ, పండితులనూ పిలిపించి రాజు వారి సలహా కోరాడు.




మంత్రి పండితులిచ్చిన ఈ సలహా వినగానే కుశుడి రక్తం ఉడికిపోయింది. యుద్ధభయంకొద్దీ వీరంతా చేరి తన భార్యను బలిచేస్తారా ?

కుశుడు వంటవాడి దుస్తులతోనే రాజు వద్దకు పోయి, "మహారాజా, ఈ పిరికివాళ్ల సలహా పాటించకండి. మీ సేనలను నాకు వప్పగించండి. నేను వెళ్లి శత్రువులనందరిని జయించివస్తాను," అన్నాడు.

మగధరాజుకు విస్మయం కలిగింది.

"నా సేనలకు వంటవాడా సేనానాయకుడు ?" అని అడిగాడు.

"మహారాజా, నేను వంటవాణ్ణి కాను. మీ పెద్ద అల్లుణ్ణి. ప్రభావతి అలక తీర్చటానికి ఇన్ని పాట్లు పడ్డాను. ఆమె ప్రాణం కాపాడటానికి యుద్ధరంగంలో చావలేనా? వెంటనే సేనను సిద్ధంచెయ్యండి."

రాజు తన అల్లుడి ఔదార్యానికి సంతోషించి వెంటనే సేనను అయత్తపరిచి, కుశుడివెంట యుద్ధరంగానికి పంపాడు.

ఈ వార్త వినగానే ప్రభావతి హృదయంలోని శిలలు ద్రవించి ప్రవాహాలు కట్టసాగాయి. ఇంత ఉదారుడైన భర్తపట్ల తాను ఎంత నీచంగా ప్రవర్తించింది! తన కొరకు అటువంటి భర్త యుద్ధరంగంలో

నిజానికి, ప్రభావతి చేసిన పని రాజభవనంలో ఎవరికీ ఇష్టంలేదు. అందుచేత తమలోతాము వితర్కించుకొని మంత్రులూ, పండితులూ చివరకు రాజుకు ఈ విధంగా సలహా ఇచ్చారు :

"మహాప్రభూ! ఈ విపత్తునుండి బయటపడటానికి ఒక్కటే ఉపాయం. ప్రభావతీ రాకుమారిని ఏడు ఖండాలుగా నరికించి, మనపైకి దండెత్తి వచ్చే ఒక్కొక్క రాజుకూ ఒక్కొక్క ఖండం కానుకగా పంపండి. అందరూ వచ్చిన దారిన తిరిగిపోతారు. దేశానికి యుద్ధభయం తొలగిపోతుంది!"

ప్రాణాలు కోల్పోతే, తాను చేసిన ద్రోహానికి పశ్చాత్తాపం ఎవరికి చెప్పుకోవాలి?

ప్రభావతి కంటికీ మంటికీ ఏకధారగా కన్నీరు కార్చసాగింది.

అయితే కుశుడికి యుద్ధరంగంలో ఎటువంటి ప్రమాదమూ జరగలేదు. కారణమేమంటే మగధరాజుపైకి దండెత్తి వచ్చిన ఏడుగురు రాజకుమారులూ కుశుడి ఆప్త స్నేహితులే. అతను మిథిల విడిచి వెళ్ళిపోయాక, అతని జాడ తెలియక వారంతా అందోళనపడ్డారు.

తమ ప్రాణస్నేహితుడైన కుశుడికి అటువంటి దుర్గతి కలిగించిన ప్రభావతిని పరాభవించి శిక్షించే ఉద్దేశంతో వారు తమతమ సైన్యాలను తీసుకొని బయలుదేరారు. కాని యుద్ధభూమిలో తమకు మగధరాజు కాక కుశుడే ఎదురయేసరికి వారి ఆశ్చర్యానికీ, ఆనందానికీ మేరలేదు.

కుశుడు వారినందరినీ వెంటబెట్టుకొని రాజభవనానికి తిరిగివచ్చినప్పుడు ప్రభావతి ఆనందానికి అసలే మేరలేదు.

కుశుడు ఏడుగురు రాజకుమారులకూ మగధరాజు మిగిలిన ఏడుగురు కుమార్తెలతో వివాహం ఏర్పాటు చేశాడు. దీనికి వారంతా సంతోషించారు.

అయితే వారిలో ఒక్కతెకూడా తన భర్తను చూసుకొని, ప్రభావతి కుశుణ్ణి చూసుకొని గర్వించినంతగా గర్వించి ఉండదని నిస్సందేహంగా చెప్పవచ్చు.

ప్రభావతి తనభర్త కాళ్ళపైబడి తన తప్పును క్షమించమని వేడింది. కుశుడు తనకళ్ళకు ఎందుకు కురూపిగా కనిపించాడో ఆమెకు అర్థంకాలేదు.

ఇప్పుడు అతని ముఖం చూస్తుంటే, అంత అందగాడు ప్రపంచంలోనే లేడని ప్రభావతికి అనిపించింది.






బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో ఒకప్పుడు బోధిసత్వుడు ఒక వానరముగా జన్మించాడు. ఈ వానరం పేరు 'నందీయుడు'. నందీయుడికి ఒక సోదరుడున్నాడు. సోదరులిద్దరూ హిమాలయ ప్రాంతాలలో ఎనభైవేల కోతుల మందకు నాయకులుగా ఉంటూవున్నారు. నందీయుడికి ఇంటిదగ్గర పోషించవలసిన తల్లి వున్నది. ఆమె పాపం, అంధురాలు.

నందీయుడూ తమ్ముడూ కలసి రోజూ, వనాలలో దొరికే మంచిమంచి ఫలాలన్నీ పట్టుకువచ్చి, మందలోని సేవకులద్వారా తల్లికి పంపించేవాళ్ళు. ఐతే, ద్రోహులైన సేవకులు ఆ ఫలాలను తల్లికి అందివ్వక, తామే కాజేస్తూవచ్చారు!

ఒకనాడు నందీయుడు తల్లిని చూడ వచ్చాడు. చూచి, ఆశ్చర్యపోయి, 'అమ్మా! ఏమిటిలా శుష్కించిపోయావు, తిండి లేనట్టుగా? రోజూ మేం పంపే ఫలాలు తినటంలేదా?' అని అడిగాడు.

'లేదు, నాయనా!–ఫలాలూ లేవు, ఏమీ లేవు. తిండి ఉంటే ఎందుకిలా చిక్కిపోతాను?' అని చెప్పింది తల్లి.

నందీయుడు బాగా ఆలోచించాడు. నిజం బోధపడింది. వెంటనే హిమాలయాలకు వెళ్ళి, జరిగిందంతా చెప్పి 'తమ్ముడూ! ఇంటివద్ద ఉండి నేను అమ్మ పోషణ చూస్తాను. నీవు నాయకత్వం వహించి, ఈ మందను ఏలుకో' అన్నాడు.

అందుకు చిన్నవాడు 'అన్నయ్యా!— నీతోపాటు నేనూ ఇంటిదగ్గరనే ఉండి, అమ్మపోషణ చూస్తాను' అన్నాడు.

ఈ విధంగా ఇద్దరూ ఏకమనస్కులై, ఇంటికి వెళ్లారు. తల్లికి ఒక రావిచెట్టుమీద చక్కని బస అమర్చి, ఆమెను వేయికళ్లతో కాపాడుతూ వచ్చారు. ఇదిలా వుండగా—





ఒకానొక బ్రాహ్మణుడు తక్షశిలా నగరంలో ఖ్యాతిపొందిన గురువువద్ద విద్యలు అభ్యసిస్తున్నాడు. విద్యాభ్యాసం పూర్తి ఐనతరువాత అతడు గురువువద్దకు పోయి, సెలవిమ్మని అనుజ్ఞ కోరాడు.

ఆయన ఈ శిష్యునిచూచి, 'నాయనా!– నీవు విద్యలు పూర్తిచేసుకున్నావు. సంతోషమే. నీది తీవ్రస్వభావము. తొందరపడి ఎన్నడూ క్రూరమైన పనులు చేయబోకు, తరవాత పశ్చాత్తాపపడినా లాభం ఉండదు. ఇదే నా ఉపదేశం" అని చెప్పి దీవించాడు.

బ్రాహ్మణకుర్రవాడు గురువువద్ద సెలవు తీసుకొని, కాశీనగరం చేరుకొన్నాడు. పెళ్ళి అయింది, గృహస్థాశ్రమం స్వీకరించాడు. అతనికి వివిధంగానూ పొట్టపోసుకోవడానికి దారి కనబడలేదు. అందుచేత, విల్లమ్ములు చేతపట్టి బోయవానివృత్తి అవలంబించాడు. జంతువులనూ పిట్టలనూ వేటాడి, వాటి మాంసం విక్రయించి, ఆ వచ్చిన డబ్బుతో కాలక్షేపం చేస్తూవచ్చాడు.

ఒకరోజున—

ఎంత తిరిగినా బ్రాహ్మడికి ఒక్క జంతువు కూడా దొరకలేదు. ఇక లాభంలేదని ఇంటికి మరలిపోతూ, అతడు ఒక రావిచెట్టుకేసి చూచాడు. ఆ సమయాన చెట్టుపలవలో– తల్లికి ఫలాహారంపెట్టి స్తిమితపరిచి, ఆమె వెనుకనే నందీయుడూ, తమ్ముడూ కూర్చొని వున్నారు. వాళ్ళూ బోయవాడిని చూచారు.

అప్పుడు—చెట్టుకేసి చూస్తూ బోయవాడు, ఉత్తచేతులతో ఇంటికి మరలడమేమిటని తలచి, తల్లికోతికి బాణం గురిపెట్టాడు. నందీయుడు చూశాడు. వెంటనే తమ్ముడితో 'అదుగో, వాడు మన తల్లికేసి బాణం గురిపెట్టాడు. ఆమె ప్రాణాలకు నేను అడ్డుపడతాను. నేను పోయిన తరువాత ఆమెను నీవే రక్షించాలి!' అంటూ, గబగబ చెట్టు దిగి వచ్చాడు.



'ఓయీ, బోయవాడా!—మా తల్లిని చంపకు. ఆమె ముసలిది, ఆమెకు బదులు నన్ను చంపు' అన్నాడు.

అందుకు కఠినాత్ముడైన ఆ బోయవాడు 'సరే'నంటూ నిర్దాక్షిణ్యంగా నందీయుణ్ణి బాణంతో కొట్టాడు.

ఐతే, ఆ మాటమీద నిలబడక బోయ వాడు, నందీయుడు చనిపోగానే మళ్ళీ తల్లికోతికి బాణం గురిపెట్టాడు. ఇది కని పెట్టి, ఈసారి చిన్నవాడు ఉరికివచ్చి, తన అన్న చెప్పినట్టే చెప్పాడు బోయవానితో. 'సరే'నన్నాడు బోయవాడు. నిర్దాక్షిణ్యంగా చిన్నవాడినికూడా చంపివేశాడు.

'నాకూ, నాకుటుంబానికి ఈ రెండు కోతులూ చాలు' అని అనుకొన్నాడు. కాని, మరుక్షణంలోనే అతడి మనసు మారి పోయింది. వాడు దయమాలి ఏమాత్రం పాపభీతి లేకుండా బాణంతో తల్లికోతిని కూడా కొట్టి, కూల్చివేశాడు.

ఈవిధంగా అనాడు చంపిన మూడు కోతులనూ బుజాన వున్న కర్రకు వేలాడ వేసి, ఉత్సాహంతో ఇంటిముఖం పట్టాడు. ఊరి పొలిమేర చేరుకొనేసరికల్లా-పిడుగు పడి వాడి ఇల్లు కాలిపోతున్నదనీ, తన భార్యా, ఇద్దరు బిడ్డలూ దానిలోనే ఉండి పోయారనీ తెలిసింది!

ఈ మాట చెవినిపడేసరికి, చెప్పలేని దుఃఖంతో గుండెలు బాదుకొంటూ ఇంటికి పోయాడు. వీడు సాహసించి లోపలికి వెళ్ళేటప్పటికి, వాడు నించున్నచోట భూమి పటాలున బద్దలయింది. వాడు పాతాళానికి పోతూ, ఈ సంగతి జ్ఞాపకం తెచ్చుకొన్నాడు:

'నా గురువుగారు అనాడే చెప్పారు, క్రూరమైన పనులు చేయవద్దని—'పశ్చాత్తాపపడినా లాభం ఉండదు సుమా' అని. నే చేసుకున్న పాపాలకుతగిన ప్రాయశ్చిత్తం అనుభవిస్తున్నాను...' అనుకొంటూ మరి కనబడకుండా నరక వాసానికి పోయాడు.





# దోషి ఎవరు?



ఒకనాటి ఉదయం పర్షియా చక్రవర్తి తన మంత్రితోసహా టైగ్రిస్ నదీతీరాన షికారు చేస్తూ, నదిలో చేపలు పట్టుతున్న ముసలి వాణ్ణి చూశాడు.

"ఒరే, ఈ ముసలితనంలో నీకీఅవస్థ ఏమిటి? రోజు కెన్ని చేపలు పడతావు? ఎంత సొమ్ము సంపాదిస్తావు?" అని చక్రవర్తి ముసలివాణ్ణి అడిగాడు.

"పేదవాణ్ణి, బాబూ. కష్టపడకపోతే పూట గడవదు. తెల్లవారుజాముఃనుంచీ వల వేస్తున్నాను. ఇంతవరకు ఒక్క చేప పడ లేదు," అన్నాడు ముసలివాడు.

"ఈసారి వల వెయ్యి. అందులో ఏమి వచ్చినా మేము నూరు మాడలిచ్చి నీవద్ద కొంటాము," అన్నాడు చక్రవర్తి.

ముసలివాడు స్థలం మార్చి వల విసిరి లాగసాగాడు. ఆ వలలో పెద్ద పెట్టె ఒకటి వచ్చింది. చక్రవర్తి ముసలివాడికి నూరు మాడలిచ్చి సేవకులచేత పెట్టెను తన భవనానికి పట్టించుకు పోయాడు.

ఆ పెట్టెలో ఏమున్నదో చూడాలని చక్రవర్తికి కుతూహలం కలిగింది. అందుచేత దానిని తన రహస్య మందిరంలోకి తీసుకుపోయి మంత్రి సహాయంతో మూత తెరిచి చూశాడు. వెంటనే ఇద్దరూ దిగ్భ్రమ చెందారు. ఆ పెట్టెలో ఒక యువతికనిపించింది. ఆమె శరీరం రక్తంతో తడిసివున్నది.

జాగ్రత్తగా పరీక్షించినమీదట ఆ యువతి చావలేదనీ, ఇంకా కొనప్రాణంతో ఉన్నదనీ తేలిపోయింది. ఆమె తలమీద బలమైన గాయం వున్నది. దానినుంచే రక్తంకారింది.

చక్రవర్తి తన వైద్యుణ్ణి పిలిపించి ఆ యువతిని బ్రతికించటం సాధ్యమవుతుందా అని అడిగాడు. రాజవైద్యుడు శాయశక్తులా యత్నిస్తానన్నాడు, కాని ఆమె కోలుకొనే అవకాశం చాలా తక్కువని చెప్పాడు.

యస్. భగవంతరావు




ఈ యువతి ఎవరో, ఆమెను ఈవిధంగా చావగొట్టి పెట్టెలో పెట్టి నదిలోకి తోసివేసిన దుర్మార్గుడెవరో తెలుసుకోవాలని చక్రవర్తికి కోరిక కలిగింది. మంత్రి భటులను నగరంలోకి పంపాడు. కాని ఆచోకీ దొరకలేదు.

మర్నాడు చక్రవర్తీ, మంత్రీ కలిసి ఒక ఆలోచన చేశారు. దానిని ఈవిధంగా అమలు జరిపారు:

"మొన్నరాత్రి ఎవరో దుర్మార్గులు ఒక యువతిని హత్యచేసి, ఆమె శవాన్ని ఒక పెట్టెలో పెట్టి టైగ్రిస్ నదిలో పారవేశారు. ఆ హంతకుణ్ణి పట్టుకొనటానికి మా మంత్రికి ఒక రోజల్లా వ్యవధి ఇచ్చాము. కాని



మంత్రి అసమర్థుడై హంతకుణ్ణి పట్టుకోలేక పోయాడు. కనుక నేటి మధ్యాన్నం మంత్రిని వధ్యశిలవద్ద బహిరంగంగా శిరచ్ఛేదం చేయవలసినదిగా ఉత్తరువు చేస్తున్నాము. పౌరులందరూ వచ్చి ఈ శిక్షను ప్రత్యక్షంగా చూడవచ్చు," అని చక్రవర్తి చాటింపు చేశాడు.

ఆరోజు మధ్యాన్నం వధ్యశిలవద్ద వేలకువేలు జనం చేరారు. సకాలంలో మంత్రిని పెడరెక్కలు విరిచికట్టి రక్షక భటులు వధ్యశిలవద్దకు తెచ్చారు. ఈ సమయంలో జనంలోనుంచి ఒక యువకుడు ముందుకు వచ్చి కొత్వాలుతో, "అయ్యా, హంతకుణ్ణి నేనే! మంత్రిగారిని విడిచిపెట్టి నా తల తీయించండి!" అని దీనంగా ప్రాధేయపడ్డాడు.

కొత్వాలు మంత్రిని విడిపించి ఆ యువకుణ్ణి వెంటబెట్టుకొని సరాసరి చక్రవర్తి వద్దకు తీసుకుపోయాడు.

"నీవేనా హంతకుడవు? అయితే ఆమె నీకేమవుతుంది? ఆమె నీకేవిధంగా ద్రోహం చేసింది?" అని చక్రవర్తి ఆ యువకుణ్ణి అడిగాడు.

ఆ యువకుడు కళ్లవెంట నీరుకారుస్తూ ఈ విధంగా చెప్పాడు:



"మహాప్రభూ! ఆ యువతి నా భార్య. మహా ఇల్లాలు! నేను పాపినై, తొందరపడి ఆమె శీలాన్ని శంకించి హత్యచేశాను. అందుకు నాకు తగిన శిక్షను భగవంతుడే ప్రసాదించాడు. నేను పశ్చాత్తాపంతో దహించుకుపోతున్నాను. నా కథ వినండి:

"నా భార్య ఇటీవల జబ్బుపడి కోలుకో సాగింది. ఆ సమయంలో ఆమెకు మామిడి పండ్లు తినాలని కోరికపుట్టింది. ఆమె కోరిక ఏవిధంగానైనా తీర్చుదామని నగర మంతా గాలించాను. కాని తరుణం కాక పోవటంచేత ఎక్కడా మామిడిపండన్నది కనిపించలేదు.




"బాగ్దాదునగరం వెళ్ళితే అక్కడదొరుకు తాయని తెలిసింది. నా భార్య ముచ్చట తీర్చటానికిగాను ఎంతో శ్రమపడి అక్కడికి వెళ్ళి మేలురకం మామిడిపండ్లు మూడు తెచ్చి యిచ్చాను. నా భార్య చాలా సంతో షించి వాటిని ఆ రాత్రి తింటానని చెప్పింది. నేను దుకాణానికి వెళ్ళాను.

"ఆ సాయంకాలం నేను దుకాణంలో ఉండగా బానిసవాడొకడు మామిడిపండొకటి తెచ్చి, 'ఇలాటివి ఎక్కడా దొరకవు. ఖరీ దుకు తీసుకొంటారా?' అని అడిగాడు. ఆ పండును చూస్తే నేను తెచ్చిన మామిడి పండ్లలో ఒకటిగా కనిపించింది. 'ఇది నీకెక్కడిదిరా?' అని అడిగాను. ఆ బానిస వాడు నాతో, 'అయ్యా, ఒక ఇల్లాలుకు నేనంటే చాలా ఇష్టం. అందుచేత ఆమె నాకీ పండిచ్చింది. ఆమె భర్త ఆమెకోసరం బాగ్దాదునుండి ఈ పండు తెచ్చాడట. తమ కేమైనా కావాలా?' అన్నాడు.

"వాడి మాటలు నేను నమ్మలేక పోయాను. నా భార్య అలాటి నీచురాలు కాదే! అయినా నిజం తెలుసుకుందామని నేను వెంటనే అంగడి మూసి ఇంటికి వెళ్ళి చూశాను. ఇంట్లో రెండు పళ్ళే ఉన్నాయి. మూడవపండునుగురించి అడిగితే నా భార్య






"ఈ చీకట్లో ఇంటి బయట యేం చేస్తున్నావు, ఎందుకేడుస్తున్నా"వని వాణ్ణి అడిగాను. దానికి వాడు, "అమ్మ దాచు కున్న మామిడిపళ్లలో ఒకటి తీసుకొని వీధిలోకి వచ్చాను. ఇంతలో వీధివెంటపోయే బానిసవాడొకడు నన్ను చూసి, "నీకు ఈ పండెక్కడిది?" అని అడిగాడు. "మా అమ్మకోసం మా నాన్నగారు బాగ్దాదునుంచి తెచ్చారు. మా అమ్మకు తెలియకుండా తినటానికి తెచ్చుకున్నాను," అని చెప్పాను. "అలా చేయవచ్చునా? ఆ పండు నాకిచ్చెయ్యి. లేకపోతే ఈ క్షణం మీ అమ్మతో చెబుతాను," అని బానిస అన్నాడు. నేను భయపడి వాడికి పండిచ్చే శాను. 'ఇంట్లోకి పోతే అమ్మ కొడుతుందని భయంగా వుంది!' అన్నాడు నా కుమారుడు.

అకారణంగా నా భార్యను చంపు కున్నందుకు నాకు దుఃఖం ఆగలేదు. నా కొడుకును చూస్తే ఆ దుఃఖం పదింత లయింది. తెల్లవారినప్పటినుంచీ ఆ బానిస వాడికోసం వెతుకుతున్నాను. వాడు నాకు కనిపించివుంటే చంపేసివుందును. అసలు శిరచ్ఛేదం జరగవలసింది వాడికి. నిష్కా రణంగా మంత్రిగారు శిక్షపడుతున్నారంటే నాకు బాధకలిగి జరిగినదంతా విన్నవించు

తెల్లబోయి తనకేమీ తెలియదన్నది. బానిస వాడి మాటలలో నాకు నమ్మకం కుదిరింది. నేను ముందూ వెనకా ఆలోచించకుండా దుడ్డుకర్ర తీసి నా భార్యనెత్తిన బలంగా కొట్టాను. ఆ దెబ్బల కామె చచ్చిపోయింది. మా ఇంట ఉన్న పాతపెట్టెలో ఆమె శవాన్ని పెట్టి, బాగా చీకటపడగానే ఆ పెట్టెను నదిలో పారేసి ఇంటికి తిరిగి వచ్చాను. నే నింట్లో ప్రవేశించబోతుండగా వీధిఅరుగుమీద ఎవరో పిల్లవాడు వెక్కి వెక్కి ఏడుస్తూ ఉండటం నాకు చీకట్లో వినిపించింది. దగ్గిరికి పోయి చూతును గదా, వాడు నా కుమారుడే.

కొన్నాను. నన్ను ప్రభువులు తగినవిధంగా శిక్షించి నాలాగ తొందరపాటు కలవారందరికీ బుద్ధి వచ్చేలాగు చేయించండి," అని తన కథ ముగించాడు యువకుడు.

"నీకు నీ భార్యపై ప్రేమ వున్నట్టు స్పష్టమవుతున్నది. లేకపోతే ఆమె కోర్కె తీర్చటానికి బాగ్దాదు నగరం వెళ్ళి మామిడి పళ్ళు తెచ్చివుండవు. నీ భార్య దోషి అన్న పూర్తి నమ్మకంతోనే నీ వామెను కొట్టావు. నీకా నమ్మకం కలిగించి, నాలుగు డబ్బుల కోసం నీతో అలాటి ఘోరమైన అబద్ధాలు చెప్పినవాడే శిక్షార్హుడు. అందుచేత నిన్ను విడిచిపుచ్చుతున్నాము. నీ కుమారుడివద్ద పండు కాజేసి దానిని నీకు అమ్మటానికి వచ్చిన బానిసను తగిన రీతి శిక్షించగలము. నీవు వెళ్లవచ్చు!" అన్నాడు చక్రవర్తి.

"మహాప్రభూ! తమరా దుర్మార్గుణ్ణి శిక్షించేపక్షంలో ఒక్క క్షణమైనా జీవించి ఉండాలని నాకు కోరికలేదు. పశ్చాత్తాపం నన్ను దహించివేస్తున్నది. నాకు మరణ దండన విధించి ఈ బాధనుండి విముక్తి కలిగించండి," అని ప్రాధేయపడ్డాడు యువకుడు. కాని చక్రవర్తి సమ్మతించలేదు.

ఒక అమాయకురాలిపై అపనింద వేసిన బానిసవాణ్ణి పట్టుకొని దండించవలసి




ఉన్నది. ఇది ఎలా సాధ్యమవుతుందా అని ఆలోచిస్తూ మంత్రి ఇంటికి బయలుదేరాడు.

మంత్రి వీధిగుమ్మంలో అడుగుపెట్టేసరికి మనుమరాలు, "తాతా," అంటూ చేతులు చాచుకొని ఎదురువచ్చింది.

మంత్రిగారు మనుమరాలిని ప్రేమగా ఎత్తుకొని ముద్దాడబోయేసరికి ఆ పిల్ల నోరు మామిడిపండు వాసన కొట్టింది.

ఆయన ఆశ్చర్యంతో, "నీకు మామిడి పండు ఎక్కడిదే, తల్లీ?" అని అడిగాడు.

"మన బానిస రహీం ఇచ్చాడు, తాతా. వాడికి ఎక్కడో దొరికిందట!" అన్నది మంత్రిగారి మనుమరాలు.



త్వరలోనే దొంగ పట్టుబడ్డాడు. మంత్రి గారు పిలిచి భయపెట్టేసరికి రహీం, తానే పిల్లవాణ్ణి బెదిరించి మామిడిపండు కాజేశా ననీ, దానిని ఒక అంగడిలో అబద్ధాలు చెప్పి అమ్మజూపాననీ, దానిని అమ్మటం సాధ్యంకాకపోయేసరికి ఇంటికి తెచ్చి ఒక రోజల్లా ఉంచి, మర్నాడు సాయంకాలం మంత్రిగారి మనమరాలికి కొంతపెట్టి మిగిలి నది తాను తిన్నాననీ ఒప్పుకున్నాడు.

మామిడిపండు దొంగిలించిన బానిస దొరికాడనీ, వాడి విచారణకు వెంటనే వచ్చి హాజరు కావలిసిందనీ యువకుడికి వర్తమానం వచ్చింది. అతను దివాణానికి వెళ్ళాడు. తనకు మామిడిపండును అమ్మ జూపిన రహీమును గుర్తించాడు.

"విచారణ పూర్తికావటానికి ఇంకొక సాక్ష్యం అవసరం. నీవు శవాన్ని గుర్తించాలి!" అన్నాడు చక్రవర్తి యువకుడితో.

ఇదే చక్రవర్తి తన కిస్తున్న నిజమైన శిక్షగా భావించి యువకుడు చక్రవర్తివెంట ఒక గదికి వెళ్లాడు.

అక్కడ ఒక పక్కమీద తన భార్య శరీరం కనిపించి యువకుడికి దుఃఖం పొర్లివచ్చింది.

కాని మరుక్షణం ఆమె కళ్లుతెరిచి తన కేసి బలహీనంగా నవ్వేసరికి యువకుడి ఆశ్చర్యానికీ, ఆనందానికీ మేరలేదు.

అతడు ఆమెకాళ్లు పట్టుకొని తన తొందరపాటుకు క్షమించవలసిందని ప్రాధేయ పడ్డాడు.

చక్రవర్తికూడా రహీమును తీవ్రంగా శిక్షించలేదు.

ఏమంటే, ఏ పిల్లవాడిదగ్గిర తాను మామిడిపండు కాజేశాడో ఆ పిల్లవాడి తండ్రికే తాను ఆ పండును అమ్మజూపు తున్నానని రహీం ఎరగడు.






# మాయ ఏనుగు

వత్సరాజ్యానికి ఉదయనుడు రాజు. కౌశాంబీనగరం అతని రాజధాని. యౌగంధరాయణుడు అతని ప్రధానమంత్రి. ఉదయనుడు యువకుడు. అందగాడు. వీణ వాయించటంలో గొప్ప నేర్పు కలవాడు. ఘోషవతి అనే ప్రశస్తమైన వీణ అతని వద్ద ఉండేది.

రాజ్యభారాన్ని కేవలం మంత్రులకు వప్పగించి ఉదయనుడు తన కాలాన్ని వీణవాయించటంలోనూ, దాని సహాయంతో అడవి ఏనుగులను పట్టటంలోనూ గడుపుతూండేవాడు. అతను అడవిలో కూర్చుని ఘోషవతిపై వాద్యం ప్రారంభించగానే ఆ పాటచేత ఆకర్షించబడి ఏనుగులు మందలు మందలుగా వచ్చి రాజపరివారానికి వశమై పోతూండేవి. తనకు ఈడైన అందగత్తె రాజకుమార్తెలలో ఎక్కడా లేవని భావించి ఉదయనుడు వివాహంకూడా చేసుకోలేదు.

అయితే అతనికి అన్నివిధాలా ఈడయిన కన్య, ఉజ్జయినీనగరాన్ని ఏలే చండమహాసేనరాజు కూతురు వాసవదత్త. కాని ఉజ్జయినీ రాజులకూ, కౌశాంబీరాజులకూ వైరం చిరకాలంగా వస్తోంది. తన కుమార్తెను ఉదయనుడికివ్వాలని ఉన్నప్పటికీ, నోరు తెరిచి అడగటానికి చండమహాసేనుడికి నామోషీ అనిపించింది. అందుచేత ఒక ఉపాయం ఆలోచించాడు. "మీరు ఉజ్జయినికి వచ్చి మా కుమార్తెకు వీణ నేర్పండి," అని చండమహాసేనుడు తన దూతద్వారా ఉదయనుడికి వర్తమానం పంపాడు.

ఈ ఆహ్వానం వినగానే ఉదయనుడికి మండిపోయింది. కాని మంత్రుల సలహాపై తన ఆగ్రహాన్ని చంపుకొని, "మీ కుమార్తెకు నావద్ద వీణ నేర్చుకోవాలని ఉంటే ఆమెను కౌశాంబీకి పంపండి," అనిమాత్రం ఉదయనుడు జవాబు పంపాడు.

కె. వెంకటగిరిరావు




కౌశాంబీనగర పరిసరారణ్యాలలో పెట్టారు. మర్నాడు ఉదయనుడికి వార్త వచ్చింది—తన అడవులలోకి ఎక్కడినుంచో బ్రహ్మాండమైన ఏనుగు వచ్చి మేస్తున్నదని! అలాటి ఏనుగును పట్టనిదే నిద్రపోరాదనుకొని ఉదయనుడు తన పరివారంతోనూ, వీణతోనూ అడవికి వెళ్ళాడు. అంతదూరాన మాయ ఏనుగును చూశాడు. అది తొండమూ, తోకా ఆడిస్తూ కనిపించింది. పెద్దపెద్ద ఏనుగులు సయితం దాని పక్కన పిల్లల్లాగా ఉంటాయి.

అటువంటి పెద్ద ఏనుగును తన సంగీతంతో ఆకర్షించి పట్టుకోవాలనే ఉద్దేశంతో ఉదయనుడు వీణ వాయించ సాగాడు.

వాసవదత్తకు వీణ నేర్పే సమయంలో ఉదయనుడు ఆమె సౌందర్యానికి వశుడై ఆమెను వివాహం చేసుకొంటానంటాడని చండమహాసేనుడి నమ్మకం. అయినా, తన కుమార్తెను ఉదయనుడివద్దకు పంపటం తన హోదాకు తక్కువైనపని. అందుచేత ఆయన తన కాబోయే అల్లుణ్ణి మాయోపాయంచేత ఉజ్జయినికి తీసుకురావాలని నిశ్చయించాడు.

ప్రపంచంలో ఎక్కడా లేనంత పెద్ద ఏనుగును కృత్రిమంగా తయారు చేశారు. దాని పొట్టలో చండమహాసేనుడి భటులు దాక్కొన్నారు. ఆ ఏనుగును రాత్రివేళ

ఆవిధంగా ఉదయనుడు సాయంకాలందాకా వీణ వాయించినా ఆ ఏనుగు పదిగజాలకంటె ముందుకు రాలేదు. ఇంక ఆలస్యమైతే చీకటిపడి పోతుందని, ఉదయనుడు తన వీణను వాయిస్తూ ఏనుగుకు సమీపంగా వెళ్ళాడు. అతని పరివారం మాత్రం దూరానే ఉండిపోయింది. ఉదయనుడు బాగా దగ్గిరికి రాగానే ఏనుగు పొట్టలో దాగివున్న భటులు బయటికివచ్చి ఉదయనుణ్ణి బంధించి అడవిమార్గంగా ఉజ్జయినికి పట్టుకు పోయారు.



ఉదయనుడు తన శత్రువైన చండ మహాసేనుడికి బందీ అయిపోయాడు. అయినా చండమహాసేనుడు అతనికేలోటూ లేకుండా అన్ని ఏర్పాట్లూ చేసి, తన కుమార్తె అయిన వాసవదత్తను వీణ నేర్చుకోవటానికి అతనివద్దకు పంపాడు. వాసవదత్తను చూసినది మొదలు ఉదయనుడికి తాను ఖైదీ అన్నది కూడా గుర్తులేకుండా పోయింది. ఆమె ఎదురుగా కూర్చుని వీణ నేర్చుకొంటూంటె ఉదయనుడు ఆనందంతో ప్రపంచమే మరిచాడు.

అక్కడ కౌశాంబీనగరంలో తమ రాజు ఖైదీ అయిన వార్తవిని ప్రజలు ఆగ్రహావేశులై ఉజ్జయిని మీద యుద్ధానికి పోవటానికి ఆత్రపడ్డారు. దూరాలోచనగల యౌగంధరాయణుడు ప్రజలను ఓర్పు వహించమని హెచ్చరించాడు.

"మోసంచేత శత్రువులు పట్టుకొని పోయిన మన రాజును యుక్తిచేత తిరిగి తెప్పిస్తాను," అని యౌగంధరాయణ మంత్రి ప్రజలకు మాట ఇచ్చాడు.

మరునాడే యౌగంధరాయణుడు, రాజ్యాన్ని జాగ్రత్తగా చూస్తూఉండమని ఇతర మంత్రులను హెచ్చరించి, వసంతకుడనేవాణ్ణి మాత్రం తనవెంట తీసుకుని బయలుదేరాడు. దారిలో వింధ్యప్రాంతంలో







ముందుగా వసంతకుడు నగరం ప్రవేశించి నేరుగా రాజభవనంవద్దకు వెళ్ళి హాస్యంచేయసాగాడు. అది చూసి ఆనందించటానికి అంతఃపురంలోని స్త్రీలూ, దాసీలూ ఎగబడ్డారు. వాసవదత్తకూడా తన సంగీతసాధన మరిచి ఈ వేడుక చూడబోయింది. ఆ సమయంలో ఒంటరిగా ఉన్న ఉదయనుడివద్దకు వెర్రివాడివేషంలో ఉన్న యౌగంధరాయణుడు వెళ్లాడు.

నిర్బంధంలో ఉన్న ఉదయనుణ్ణి చూడగానే యౌగంధరాయణుడి కంట అప్రయత్నంగా నీరు వచ్చేసింది. దానిని చూసి ఉదయనుడు అతణ్ణి గుర్తించగలిగాడు.

"రాజా! ఏవిధంగానైనా ఈ వాసవదత్తను నీపక్షం చేసుకోగలిగితివా, నేను నిన్ను నిర్బంధంనుంచి తప్పిస్తాను. కనుక ఆ ప్రయత్నంలో ఉండు. నేను మళ్ళీ కనిపిస్తాను," అని యౌగంధరాయణుడు వెళ్లిపోయాడు.

ఉదయనుడూ, వాసవదత్తా అదివరకే రహస్యంగా ఒకరినొకరు ప్రేమిస్తూ ఉండటం చేత వాసవదత్త అతనిపక్షం కావటానికి ఎంతోకాలం పట్టలేదు. వీలు దొరకగానే, తండ్రికి తెలియకుండా ఉదయనుడివెంట పారిపోవటానికి వాసవదత్త ఒప్పుకొన్నది.

పుళిందకుడనే రాజున్నాడు. అతను ఉదయనుడికి మంచి స్నేహితుడు. యౌగంధరాయణుడు పుళిందకుడికి జరిగినదంతా చెప్పి, సేనలను సన్నద్ధంగా ఉంచమని హెచ్చరించి, వసంతకుడివెంట ఉజ్జయినికి చారితిశాడు.

ఉజ్జయిని సమీపంలో మహాకాళశ్మశానం ఉన్నది. అందులో యౌగంధరాయణుడూ, వసంతకుడూ తమ వేషాలు పూర్తిగా మార్చేసుకున్నారు. వసంతకుడు హాస్యం పుట్టించేలాగు వికారాకారంతో తయారయాడు. యౌగంధరాయణుడు జాలి గొలిపే వెర్రివాడిలాగా తయారయాడు.





చండమహాసేనుడివద్ద ఉండే ఏనుగులన్నిటిలోకీ అతివేగంగా పరిగెత్తగలది భద్రవతి అనే ఏనుగు. దానిని నడిపేవాడు ఆషాఢకుడనే మావటి. ఈ ఏనుగును రాజు అదివరకే తన కూతురైన వాసవదత్తకు కానుకగా ఇచ్చాడు. యౌగంధరాయణుడు ఆషాఢకుడికి పుష్కలంగా డబ్బిచ్చి తనపక్షం చేసుకున్నాడు.

ఉదయనుణ్ణి బంధవిముక్తుణ్ణి చేయటానికి యౌగంధరాయణుడు ఉపాయం ఆలోచించి వసంతకుడికి చెప్పాడు. రెండురోజులు ముందుగానే బయలుదేరి పుళిందనగరానికి వెళ్ళాడు.

ఒక రాత్రి రాజుగారి ఏనుగుల పెద్ద మావటిని తప్ప తాగించారు. వాసవదత్త ఉదయనుడికి విల్లూ, బాణాలూ, కత్తీ మొదలైనవి తెచ్చి ఇచ్చింది. అర్ధరాత్రివేళ ఉదయనుడూ, వాసవదత్తా, వసంతకుడూ భద్రవతి అనే ఏనుగునెక్కి బయలుదేరారు. రాజప్రాసాదంలో దారికి అడ్డువచ్చిన రాజభటులను ఉదయనుడు చంపేశాడు. ఊరుదాటి భద్రవతి పుళిందనగరం దారిపట్టి పోసాగింది.

ఖైదీగా ఉండిన ఉదయనుడు తన కుమార్తెతోసహా పారిపోయాడని చండమహాసేనుడికి హతశేషులైన దూతలవల్ల తెలిసేసరికి అంతా మించి పోయింది. చండమహాసేనుడు కూడా ఏనుగు ఎక్కి పరివారంతోసహా బయలుదేరాడుగాని, భద్రవతిని కలుసుకోవటం మరే ఏనుగుకూ సాధ్యంకాని పని.

కాని తీరా వింధ్యప్రాంతం చేరేసరికి భద్రవతి అలిసిఉన్నమీదట నీరు తాగి అకాలమరణంవాత పడింది. అక్కడినుండి ఉదయనుడూ, వాసవదత్తా కాలిమార్గాన పుళిందనగరం వెళ్లవలసివచ్చింది. దారిలో దొంగలు అడ్డుతగిలారు. ఉదయనుడు వారిని తన కత్తికి బలిఇచ్చాడు.

ఎన్నడూ అలాటి చోట నడిచి ఎరగని వాసవదత్త కాళ్ళనిండా ముళ్ళు గుచ్చుకొన్నాయి. ఎలాగైతేనేం, వారు క్షేమంగా పుళిందనగరం చేరారు.

ఆ సమయానికే కౌశాంబీనుంచి ఉదయనుడికి సహాయపడేందుకు సైన్యం వచ్చి అక్కడ చేరింది. శిబిరాలువేశారు.

చండమహాసేనుడితో తేల్చుకోవాలనే ఉద్దేశంతో ఉదయనుడు నగరుకుకూడా వెళ్ళక శిబిరాలలోనే ఉండిపోయాడు. ఉజ్జయినీ సేనలతో తలపడటానికి సర్వసన్నాహలూ జరిగాయి.

ఇంతలో చండమహాసేనుడు ఒక దూత ద్వారా ఉదయనుడికి ఈ విధంగా వర్తమానం పంపాడు:

"రాజా, నీవు నా కుమార్తెను తీసుకొని పోయినందుకు నేను ఆగ్రహించను. మీ ఇద్దరికీ వివాహంచేయాలనే ఉద్దేశంతోనే నిన్ను ఖైదుచేసి తెచ్చాను. కనుక మీ యిద్దరి వివాహమూ యథావిధిగా జరగాలని నా కోరిక. కొద్ది వ్యవధి ఇచ్చినట్లయితే నా కుమారుడు గోపాలకుడు వచ్చి తన చేతిమీదుగానే తన చెల్లెలి వివాహం జరిపించగలడు."

ఈ వార్త వినగానే ఉదయనుడికి తృప్తి కలిగింది. తన పుట్టింటివారితో కలహం లేకుండాపోయినందుకు వాసవదత్తకూడా చాలా సంతోషించింది.

అందరూ కలిసి కౌశాంబీ నగరానికి వెళ్ళారు. అక్కడ వివాహానికి ముహూర్తం నిశ్చయించబడింది.

అట్టహాసంగా వివాహయత్నాలు చేశారు. వివాహానికి వాసవదత్త అన్న గోపాలకుడు విలువైన బహుమానాలు తీసుకొని వచ్చాడు. ఉదయనుడి మిత్రుడు పుళిందకుడూ, ఇంకా అనేకమంది రాజులూ సపరివారంగా వచ్చారు. ఉదయన వాసవదత్తల వివాహం అతి వైభవంగా జరిగింది.



# చందమామ

ఆకాశంలో కనిపించే చందమామనుగురించి కిందటినెల కొన్ని వివరాలు తెలుసుకున్నారు. ఈ నెల మరికొన్ని విషయాలు తెలుసుకోండి.

* ఒకప్పుడు భూమి మండుతూఉండే ద్రవగోళంగా ఉండేది. భూమిలోని పదార్థం కొంత వేరుపడిపోయి, కాలక్రమాన గట్టిపడి చందమామ అయిందని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. మొదట్లో చందమామ భూమికి చాలా దగ్గిరలో ఉండి భూమిచుట్టూ తిరిగేది. రానురాను అది భూమికి దూరంగా పోయింది.

* భూమిచుట్టూ చందమామ ప్రదక్షిణంచేసే మార్గం కోడిగుడ్డు ఆకారంలో ఉంటుంది. అందుచేత చందమామ ఒకప్పుడు భూమికి కొద్దిగా దగ్గిరవుతుంది, ఒకప్పుడు కొంచెం దూరం అవుతుంది.

* భూమిలాగే చందమామకూడా తనచుట్టూ తాను తిరుగుతూ ఆత్మప్రదక్షిణం చేస్తున్నది. భూమిచుట్టూ ఒకసారి తిరిగివచ్చేసరికి చందమామ తనచుట్టూ తాను ఒక్కసారి తిరుగుతుంది, అందుచేత భూమివైపు చందమామ ముఖం ఒకటే కనిపిస్తుంది. చందమామ వెనుకవైపు ఎలా ఉంటుందో మనం చూసే అవకాశం లేదు. (ఈ విషయం మీకు సరిగా అర్థం కానిపక్షంలో, గదిమధ్యను దీపంపెట్టి, దానివైపే ముఖం ఉంచి, దానిచుట్టూ ఒక్కసారి ప్రదక్షిణం చేసిరండి. ఈలోపుగా మీరు ఒక్కసారి ఆత్మప్రదక్షిణం చేస్తారు.)

* మనం నివసించే భూమి 24 గంటల కొకసారి ఆత్మప్రదక్షిణం—తనచుట్టూ తాను తిరగటం—చేస్తుంది. అందుచేత 24 గంటలు మనకొక రోజు. చందమామ తన చుట్టూ తాను తిరగటానికి, భూమిచుట్టూ తిరిగిరావటానికీకూడా 27 రోజుల, 7 గంటల, 43 నిమిషాల, 11 సెకండ్లకాలం పడుతుంది.

* చందమామ రోజు 27 రోజుల పైచిల్లర. ఇందులో సగం—దాదాపు 14 రోజులు—పగలు, 14 రోజులు రాత్రి. చందమామలో పగలు భరించలేని వేడీ, రాత్రి భరించలేని చలీ. భూమిమీద పడే సూర్యకాంతి అనేకమైళ్ళ గాలిని దాటి, తీక్షం తగ్గి మనదగ్గిరికి వస్తుంది, కనుక మనం దానికి తట్టుకోగలుగుతున్నాం. చందమామలో ఏ విధమైన గాలీ లేదు. అందుచేత అక్కడి ఎండ మనం ఊహించలేనంత తీక్షంగా ఉంటుంది. మరొక చిత్రమేమంటే, సూర్యకాంతిలోని నీలికిరణాలు వాతావరణంమూలంగా చెదిరి నలువైపులా ప్రసరించటంవల్ల మనకు ఆకాశం నీలంగా కనిపిస్తుంది. కాని వాతావరణం లేని చంద్రమండలంలోనుంచి చూసినట్టయితే ఆకాశం తారులాగా నల్లగా కనిపిస్తుంది. అందులో సూర్యుడు, అనేకవేల చందమామల పెట్టుగా, దేదీప్యమానంగా ప్రకాశిస్తాడు.



# కొయ్య కోడలు

పూర్వం హస్తినాపురంలో శివదత్తుడనే బ్రాహ్మడుండేవాడు. అయన గొప్ప ధనికుడు. అయినా ఆయన జీవితానికి సుఖమన్నది ఎరగడు. ఎందుచేతనంటే ఆయన భార్య పరమ క్రూరాత్మురాలు, గయ్యాళి. అటువంటి భార్యతో వేగలేక చివరకు శివదత్తుడు ఇంటినుంచి లేచిపోయి సన్యాసం పుచ్చుకొన్నాడు.

శివదత్తుడికి ముగ్గురు కుమారులుండేవారు. పెద్దవాడికి వివాహం అయి కోడలు ఇంటికి రాగానే అత్తగారు కోరంటకం పెట్టనారంభించింది. ఈ కష్టాలు కొంతకాలం భరించి పెద్దకోడలు పుట్టింటికి వెళ్ళిపోయింది. అమె వెనకనే ఆమె భర్తకూడా అత్తవారిల్లు చేరి ఇల్లరికం ఉండసాగాడు.

తరువాత రెండవవాడి భార్య కాపరానికి వచ్చింది. వాడి భార్యనుకూడా గయ్యాళి అత్తగారు కాల్చుకుతినసాగింది. పరమ సాధ్వి అయిన రెండవ కోడలు, అత్తగారు పెట్టే కష్టాలు భరించలేక, పుట్టింటికి వెళ్లితే గౌరవంగా వుండదని, ఒకనాడు ఉరిపోసుకు చనిపోయింది. భార్య పోగానే మనోవ్యాధితో రెండవ కుమారుడు మంచంపట్టి, కొద్ది కాలానికి మరణించాడు.

తన అన్నలిద్దరి గతీ చూసిన మూడవ కొడుకు, వసుదత్తుడనేవాడు, తన తల్లికి మంచి గుణపాఠం నేర్పదలుచుకొన్నాడు.

ఆవిడ ఇంత గయ్యాళి మనిషి అయినప్పటికీ, ఇంటి మగవాళ్ళు ఉదారవంతులు కావటంచేత, ఆవిడ చేసే దౌర్జన్యం ఎవరికీ తెలియదు. పెద్దకోడలు గడుసుది కావటంచేత భర్తను వశపరుచుకుని పుట్టింటికి లేచిపోయిందనీ, రెండవ కోడలు అఘాయిత్యంచేత ఆత్మహత్య చేసుకున్నదనీ పైవాళ్లు అనుకున్నారు. తల్లి దుర్మార్గం నలుగురికీ తెలిసివచ్చేటట్టు

ఆర్. ప్రసూనాంబ

చేయటానికి వసుదత్తుడు ఒక ఉపాయం ఆలోచించాడు.

వాడు ఒకరోజు పొరుగూరు వెళ్లి మనిషి ఎత్తు కొయ్యబొమ్మను చేయించాడు. అర్ధ రాత్రివేళ ఆ బొమ్మను బండిలో తెచ్చి తన ఇంటి పక్కనే మరొక ఇంట్లో వుంచి, ఆ ఇంటికి గడియ వేసి, వాకిలిదగ్గిర దాసీదాన్ని కాపలావుంచి తల్లిదగ్గిరికి వచ్చి, "అమ్మా, నేను పెళ్లి చేసుకొనివచ్చాను. నా భార్య మన యింట వుంటే పోట్లాటలు వస్తాయి. అందుచేత దానిని పక్కయింట్లో ఉంచాను. అది ఇక్కడికి రానూవద్దు, నువు అక్కడికి పోనూవద్దు!" అన్నాడు.

తల్లి సరేనన్నది. కాని, పెద్ద కోడళ్లిద్దరి మీదా ఉన్న కసి మూడోదానిమీద తీర్చుకో లేకపోతినే అని బాధపడింది. ఒకనాడు కొడుకు ఇంట్లో లేకుండాచూసి, ఆమె రోకలిబండతో తల పగలగొట్టుకుని, పెడ బొబ్బలు పెట్టసాగింది.

అందరూ చేరారు. ఆ సమయానికి కొడుకు కూడా వచ్చాడు. ఏమయిందని అందరూ అడిగారు.

"చూశారా? నా కోడలు అకారణంగా వచ్చి రోకలిబండతో నా తల పగలగొట్టి లోపలికి పోయి తలుపు వేసుకున్నది!" అని ఆ గయ్యాళిది అందరికీ చెప్పింది.

"ఎంతపని జరిగిందీ!" అనుకుంటూ అందరూ పొరుగింట్లోకి జొరపడి చూసే సరికి, ఏమున్నదీ? కొయ్యబొమ్మ!

"ఇదే నా భార్య! ఇదే మా అమ్మను రోకలితో తల పగలగొట్టి లోపలికి వచ్చి తలుపేసుకున్నది!" అని వసుదత్తుడు అందరికీ చెప్పాడు. అందరూ గయ్యాళి దాన్ని హేళనచేశారు, బాగాతిట్టారు.

ఆతరవాత కొన్నాళ్ళకు వసుదత్తుడు మంచి కన్యనుచూసి పెళ్లాడాడు. ఆ పిల్లను అత్తగారు ఎన్నడూ పల్లెత్తుమాట అన్న పాపాన పోలేదు.





# మాటకారి ముసలమ్మ

ధారానగరానికి రాజైన భోజరాజూ, ఆయన ఆస్థాన కవులలో ఒకడైన మాఘుడూ ఒక నాడు సాయంకాలం షికారు బయలు దేరారు. కవితాగోష్ఠిలో వారు కాలంమరచి చాలాదూరం వెళ్ళారు. చీకటిపడిపోయింది. వారు రాజభవనానికి బయలుదేరేసరికి దారి ఎటో తెలియలేదు.

ఎవరినైనా అడిగి దారి ఎటో తెలుసు కొందామని వారు కొంతదూరం నడిచి ఒక పూరిగుడిసెవద్దకు వచ్చారు. అక్కడ వారి కొక ముసలమ్మ కనిపించింది.

భోజరాజు ఆ ముసలమ్మతో, "అవ్వా, ఈ దారి ఎక్కడికిపోతుంది?" అని అడిగాడు.

"ఎక్కడికి పోవాలో దారినపోయేవాళ్లకు తెలియాలిగాని దారికేం తెలుస్తుంది, నాయనా? మీరెవరు?" అన్నది మాటకారి అయిన ముసలమ్మ.

"మేము ప్రయాణీకులం," అన్నాడు మాఘుడు నవ్వుతూ.

"సృష్టిలో సూర్య చంద్రులిద్దరే ప్రయాణీకులు. మీరు సూర్య చంద్రులా?" అని అడిగింది ముసలమ్మ.

"మేము క్షణికమైన అతిథులం," అన్నాడు మాఘుడు.

"డబ్బూ, యవ్వనమూ—ఈ రెండే క్షణికమైన అతిథులు. మీరు అలా కనిపించరే?" అన్నది ముసలమ్మ.

'మేము పాలకులం' అన్నాడు భోజరాజు.

"ఇంద్రుడూ, యముడూ మాత్రమే పాలకులు. మీరు వారు కారుగద!" అన్నది ముసలమ్మ.

"కాని మేము సహనం కలవాళ్ళం కూడా," అన్నాడు భోజరాజు.

"భూమీ, స్త్రీ మాత్రమే సహనం కల వాళ్ళు!" అన్నది ముసలమ్మ.

డి. దశరథరామయ్య

"మేము విరాగులం," అన్నాడు మాఘుడు.

"విరాగులుగా చెప్పుకోతగినవి శనీ, సంతృప్తీ మాత్రమే," అన్నది ముసలమ్మ.

"మేము పరదేశీయులం!" అన్నాడు భోజరాజు.

"జీవాత్మా, చెట్టు తీసుకునే నీరూ మాత్రమే పరదేశీయమైనవి," అన్నది ముసలమ్మ.

'మేము పేదవాళ్లం' అన్నాడు మాఘుడు.

"గొర్రెపిల్లా, ఆడపిల్లా మాత్రమే పేదవాళ్ళు." అన్నది ముసలమ్మ.

"మేము సమర్థులం," అన్నాడు భోజరాజు.

"సామర్థ్యం గలవి అన్నమూ, నీరూ," అన్నది ముసలమ్మ.

"అవ్వా! మేం ఓడిపోయాం!" అన్నాడు మాఘుడు ముసలమ్మ ధోరణికి తట్టుకోలేక.

"అప్పుల బాధకలవాడూ, ఆడపిల్లను కన్నవాడూ తప్ప ఎవరూ ఓడిపోరు, నాయనా! ఇంతకూ మీరెవరో, ఏంకావాలో చెప్పారుకారు. చెబితే నా చేతనైన సహాయం చేద్దును," అన్నది ముసలమ్మ.

మాఘుడు తన పాండిత్యమంతా కట్టిపెట్టి, "అవ్వా, వీరు భోజరాజుగారు. నన్ను మాఘుడంటారు. మేము రాజనగరుకు దారితెలియక చీకట్లో చిక్కిపోయాం!" అని చెప్పాడు.

"ఆమాట మొదటనే చెబితే సరిపోయేదిగా! ఈ దారినే నేరుగా వెళ్లండి రాజనగరు చేరుకుంటారు," అన్నది ముసలమ్మ.

భోజరాజూ, మాఘుడూ ముసలమ్మ చెప్పిన దారినే వెళ్లి రాజనగరు చేరారు. తరవాత భోజరాజు, ముసలమ్మకు అక్షర లక్షలు బహుమతి పంపించాడు.



# మాయాచక్రం (అట్టచివరి బొమ్మ) - 2

రాక్షసి శాపంవల్ల రాజు తల గాడిద తలగా మారిపోగానే, దర్బారులో పెద్ద గగ్గోలు బయల్దేరిందికదా!—అటువంటి సమయంలో దేవత ముందుకువచ్చి, 'రాజా!—నీవేమీ భయపడకు. అసూయవల్ల రాక్షసి ఈ పని చేసింది. అసూయకు విరుగుడు అనురాగమే. కనుక, నీయందు అనురాగంచూపే చిన్నదానిని ఎప్పుడు పెళ్లాడతావో, ఆ క్షణమందే ఈ శాపంనుంచి విముక్తుడవవుతావు' అని చెప్పి, అంతర్ధానమైంది.

వెంటనే, రాజాజ్ఞప్రకారం చాటింపు జరిగింది. ఆ చాటింపు విని, దేశదేశాలనుండి అందకత్తెలైనటువంటి కన్యలు చాలామంది వచ్చారు. వారందరికీ రాజును వివాహం ఆడాలనేవుంది. కాని రాజుకు రాక్షసివల్ల జరిగిన అపకారం వారికి తెలీదు.

రాజు ఆ వచ్చిన అందకత్తెలనందరనూ చూచాడు. వారి అందచందాలను మెచ్చుకొన్నాడుకూడా. ఐతే ఏం లాభం?—ఎంతో ఆప్యాయంగా రాజును చూడవచ్చిన కన్యలందరూ రాజుతల చూచి అసహ్యించుకొని, వచ్చినదారినే తిరిగిపోసాగారు.

ఇక ఈ జన్మకింతేకాబోలు ననుకొని, రాజు నిస్పృహతో కోటలోకి పోబోతూవుండగా, ఒక పొన్నచెట్టుకింద అపురూపసౌందర్యవతి ఐన చిన్నది కంటబడింది. అయితే, పేదరాలు కావడంచేత నలుగురలోకీ వచ్చి రాజును చూడటానికి బిడియపడింది. ఆ చెట్టుకిందనే నించుని ఆసక్తితో రాజును పరికిస్తున్నది.

ఈ సందర్భమంతా గ్రహించిన రాజు, మారుయోచన లేకుండా 'నీవే నా రాణివి!' అన్నాడు ఆమెతో. ఆ చిన్నది చిరునవ్వు నవ్వి, సిగ్గుతో తల వంచుకొన్నది.

అప్పటికప్పుడే పరిచారకులు వచ్చి ఆమెను అమూల్యములైన దుస్తులతోను, ఆభరణాలతోను అలంకరించారు. నగరం మధ్యనవున్న ఆలయంలో అతివైభవంగా వివాహం జరిగింది.

పెళ్ళి కాగానే, తనను ఏదో అడగడానికి రాణి ఎదురుచూస్తూవున్నట్టు కనిపెట్టాడు రాజు. 'రేపు ఉదయంవరకూ నన్నేవిషయంలోనూ ప్రశ్నించవద్దు. అటుపైన సంగతి సందర్భాలన్నీ నీకే తెలుస్తాయి' అన్నాడు. అన్నాడేకాని...

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1955 ఫిబ్రవరి సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని కావాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.

★ డిశెంబర్ 7-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## డిశెంబరు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : చిక్కిన చారలజంతువు | రెండవ ఫోటో : ఎక్కిన పారనిజంతువు

పంపినవారు : ఎ. కృష్ణమోహన్‌రావు,

37/17, షేక్ ఇమామ్స్ లేన్, రామానాయుడుపేట - మచిలీపట్నం

బహుమతిమొత్తం రు. 10/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.



# వార్తలు-విశేషాలు

నవంబరు 14 జవహర్లాల్ నెహ్రూ 66-వ జన్మదినం. అంటే భారత ప్రధానికి 65 ఏళ్ళు నిండి 66-వ ఏడు ప్రవేశించింది. ఈ సందర్భంలో నెహ్రూకు దేశమంతటినుంచీ 50 లక్షల రూపాయలు విలువగల బహుమతులు చదివించబడ్డాయి. వీటిలో కొత్త స్కూళ్ళూ, భూములూ, పుస్తకాలూ, లైబ్రరీలకూ వ్యాయామకేంద్రాలకూ పనికివచ్చే వస్తుసామగ్రి వగైరాలున్నాయి. ఈ దినం దేశమంతటా బాలల దినంగా జరపబడింది. దేశమంతటినుంచీ బాలలు నెహ్రూకు జేజేలు చెప్పారు.

ఢిల్లీలోని నేషనల్ స్టేడియమ్‌లో లక్షమంది బాలలకుపైగా కొత్త దుస్తులు ధరించి సమావేశమయారు. 66 మంది బాలలు తెల్లని దుస్తులు ధరించి స్టేడియం వాకిట నెహ్రూకు స్వాగతం చెప్పి పుష్పమాలలు వేశారు. స్టేడియం అంతటా తోరణాలు అలంకరించారు. వేరు వేరు స్కూళ్ళకు సంబంధించిన జెండాలు ఎగురుతున్నాయి. నెహ్రూ తెల్లని పావురాన్ని ఎగరవేయటంతో ఉత్సవం ప్రారంభమయింది. (పావురం శాంతి చిహ్నం) వెంటనే 66 తెల్ల పావురాలను పిల్లలు గాలిలోకి వదిలారు. 500 మంది పిల్లలు దేశంలోని వివిధ ప్రాంతాలగల దుస్తులను ధరించి, వివిధ భాషలలో పాటలు పాడుతూ నడిచివెళ్ళారు. పిల్లల ఆటలూ, పాటలూ, నృత్యాలూ చూసి ఆనందిస్తూ నెహ్రూ రెండు గంటలు గడిపారు.

*  *  *  *

ఉత్తరప్రదేశంలోని మనిపురీకి చెందిన సబిన్‌స్పెక్టర్ పీతంసింగ్‌కు రాష్ట్రపతి పతకం బహూకరించారు. గతసంవత్సరం కొందరు బందిపోటు దొంగలను ఎదుర్కొనటంలో ఈ పోలీసు అధికారి అసమానమైన ధైర్యపరాక్రమాలు ప్రదర్శించాడట.



విద్యావంతుల నిరుద్యోగసమస్య పరిష్కరించటానికిగాను ఇండియాప్రభుత్వం ఏర్పాటు చేసిన పథకంకింద 1530 కొత్త స్కూళ్ళు ప్రారంభించటానికి మద్రాసుప్రభుత్వం నిర్ణయించింది. అయిదువందలకు పైబడిన జనసంఖ్య ఉండి స్కూళ్ళు లేకుండా ఉన్న చోట్ల ఈ స్కూళ్లు ప్రారంభించబడతాయి.

* * * *

శ్రీమతి విజయలక్ష్మిపండిట్‌కు అక్టోబరు ఆఖరులో టోక్యోనగరంలో గొప్ప సన్మానం జరిగింది ఆమె అక్కడ పత్రికాప్రతినిధులతో ప్రసంగిస్తూ జపానులోపిల్లలు ఏడవరని చెప్పింది.

* * * *

నవంబరు 1 నుండి పుదుచ్చేరి, కారైకాల్, మాహే. యానాం ప్రాంతాలు భారతదేశంతో చేరిపోయాయి. అంతదాకా ఇవి ఫ్రెంచివారి అధీనంలో ఉంటూవచ్చాయి. భారత ప్రభుత్వం అనుసరిస్తూవచ్చిన శాంతియుతవిధానాల ఫలితంగా ఈ మార్పు ఎట్టి ఘర్షణా లేకుండా జరిగింది.

* * * *

అక్టోబరు మాసాంతంలో ఇద్దరు రష్యనులు, నామ్యో మెద్వెదెవ్, పెట్రోవిచ్ అనేవారు, పారషూట్‌ల సహాయంతో ఉత్తర ధృవప్రాంతంలో దిగారట. ఈ ప్రాంతానికి ఈవిధంగా మొదటిసారి చేరినవారు వీరే. శాస్త్ర పరిశీలనలు సాగించటంకోసరం తగిన స్థలాలను చూడటానికి వీరు దించబడ్డారట.

* * * *

నవంబరు 6 న ఆంధ్ర శాసనసభలో ప్రతిపక్షీయులు తెచ్చిన అవిశ్వాస తీర్మానం ఫలితంగా ఆంధ్రప్రభుత్వ పక్షం ఒక వోటు మెజారిటీతో ఓడిపోయింది. ప్రధానమంత్రి టంగుటూరి ప్రకాశం, తదితర మంత్రులు తమ రాజీనామాలను గవర్నరు త్రివేదికి అందజేశారు. ఆంధ్ర రాష్ట్రం తాత్కాలికంగా అధ్యక్షుని పరిపాలనకింద ఉండేటట్టూ, రాగల ఫిబ్రవరి ఆఖరులోగా తిరిగి ఎన్నికలు జరిగేటట్టూ కేంద్రప్రభుత్వం నిర్ణయించింది.



# చిత్రకథ



వాసూ, దాసూ సెలవురోజున ఊరిబయిట పచ్చికబయలులో కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు. 'టైగర్' అక్కడ ఎగురుతున్న సీతాకోకచిలుకతో ఆడుకుంటోంది. "దాసూ, నేను జేబుగుడ్డతో ఆ సీతాకొకచిలుకను పట్టుకుంటాను. రేపు స్కూలుకు తీసుకువెళ్ళి అందరికీ చూపుదాం," అంటూ లేచాడు వాసు.



సీతాకోక చిలుక ఎగురుతూంటే దానితోపాటు గంతులేస్తూ వాసు వెంటబడ్డాడు. అది అతడికి అందినట్టే కనబడుతూ, అంతలోకే దూరంగా పోసాగింది. దానినెలాఅయినా చేజిక్కించుకోవాలనే ఆత్రంలో వాసు పోయిపోయి చివరకు నీళ్ళగుంటలో పడ్డాడు. సీతాకోకచిలుక మాత్రం తప్పించుకు పారిపోయింది.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him for Chandamama Publications, Madras 26. Controlling Editor: SRI 'CHAKRAPANI'

Photo by B. Bhansali



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఎక్కిన పారని జంతువు

పంపినవారు :
ఎ. కె. మోహన్‌రావు

